# తిరుమాళిగ

(నవల)

శ్రీ మునిమాణిక్యం నరసింహారావు బి. ఎ., యల్. టి.



పబ్లిషర్సు:

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో

బుక్ సెల్లర్సు అండ్ పబ్లిషర్సు

రాజమండ్రి.

# తి రు మా ళి గ

## ఆమె

నాకథ. కన్నతండ్రికి నేను బరువైపోయినాను. తల్లి ఉంటే కడుపులో పెట్టుకొని కాపాడేది. లేకపోబట్టి నా కీస్థితి రాగానే సంఘతిరస్కారానికిగురియై అమ్మలక్కలఆడిపోతలకు తట్టుకోలేక మానాన్న నన్ను ఇంటినుండి పంపేశాడు.

ఆయననిర్దయుడని నేననను. ఆయన నన్ను అతిగారాబంగా పెంచాడు. ఎండకన్నెరుగను. తలంటిపోసుకొని శుక్రవారపు ప్రొద్దులు నేచూడలేదు. అల్లాంటి తండ్రిహృదయం పాషాణం అయిపోయింది. ఏఅనాథ శరణాలయానికో పంపి ఆ చెంబెడునీళ్ళుపోయిద్దామని ఆయనకుతోచలేదు. మాయ లోకనిందపడలేక నన్ను ఏఅడివిలోనో వదిలేద్దామన్న ఊహ మాత్రమే ఆయనకు తోచింది.

నాకు అప్పుడు మతేలేదు. కట్టెనైపోయినాను. ఎటు నడవమంటే అటునడిచాను. నేను చేసింది మహాపాపమనీ, ఎంతకఠినశిక్ష అయినాసరే ఆపాపాన్ని కడిగివేయలేదనీ నేను అనుకొన్నాను. నలుగురిలో నా కదివరకున్న మన్ననా మర్యాదాఅంతా పోయినట్లుతోచింది. నాస్నేహితులునన్ను జూచి ముసిముసినవ్వులు నవ్వుకొంటూ తొలగిపొయ్యేవాళ్లు. నన్నేదో క్రూరమృగానికిమల్లె చూచినవారు లేకపోలేదు. కొందరు మహాపతివ్రతలు. నాకూ చచ్చినచావు అయింది.

ఆపల్లెటూరునువదలి పోవటమే శ్రేయస్కర మనిపించింది. సాంఘికమర్యాదకు భిన్నమైన అల్లాంటి అవినీతిపని చేయకుండా నియమబద్ధమైన వైవాహిక జీవనం కల్పించుకొని సుఖిస్తే నాకింతఅవస్థలేకపోయేది. ఇంతకూ, నాకర్మ ఇల్లాగ ఉంది. జరగవలసినదంతా జరిగింది. ఆరోజు దశమీ ఆదివారం, అనుకుంటాను, అవునుదశమే. నేను పెందరాళేలేచి తలంటినీళ్ళు పోసుకొని దొడ్లో బాదం చెట్టుక్రింద కూర్చుని తల ఆర్చుకొంటున్నాను. ఎందుచేతనో నాకుదిగులే లేదు. ఏమి మొండి ధైర్యమో నాకు తెలియదు. మామూలు గృహిణికిమల్లెనాకు కూడా అచ్చటాముచ్చటా జరిగితేబాగుండుననుకొనేదాన్ని. అయ్యో!అయ్యో! నా తెలివితక్కువకు అనుకోవాలె! మొగుడు పోయినాడని ఏడుస్తూ కూర్చోవలసినదానికి ఈస్థితిలబ్బిందే అని దుఃఖపడాలిసిందిపోయి అచ్చట్లూముచ్చట్లూకోసం ఆశ పడటం నామూర్ఖత కాకపోతే మరేమిటి?

అల్లాతలఆర్చుకుంటూ ఉండంగానేమానాన్నగారుచటుక్కునవచ్చేసి "అమ్మాయీ, చప్పున అన్నంతినేసెయ్యి, పది గంటలకుప్రయాణం" అన్నాడు. "ఎక్కడికీ?" అని నేను అడగలేదు. తెలుసుకోవాలని కుతూహలమూ కలగలేదు. ఈవూరు కాకపొయ్యాక ఎక్కడికైతేనేమి? ఆవిచిత్రం ఏమిటో, నా గుండెరాయిఅయిపోయింది. ఎక్కడదిగబెడతాడాన్న దిగులు లేదు. భవిష్యత్తులో నాగతిఏమిటా అన్న ఆదుర్దా లేదు. ఇంత

పిల్లనై ఉన్నప్పటినుంచీ పెరిగిబెద్దదాన్ని అయినస్వగ్రామాన్ని వదలిపోవాలిసి వచ్చిందే అన్నచింత లేదు. కొయ్య బొమ్మనై పోయినాను. నాబట్టలు మూటగట్టుకొని ప్రయాణానికి సిద్ధమైనాను. మావూరునుంచి అరమైలుదూరంలో ఉందిరైల్వేస్టేషను. ఆ అరమైలు దూరమూ, వనవాసానికై లక్ష్మణుడు సీతను తీసికొని పోయినట్లు మానాన్న నన్ను తీసుకొనిపోయినాడు. తరువాత కొంతసేపటికి రైలెక్కాము; రైలుకదలింది. దూరాన మావూరుకనిపిస్తూనేఉంది. కాని, ఈపాపికి చూపుమేరదూరంలో ఉంటానికిఇష్టంలేక కామూలు, అతివేగంతో నాదృష్టిపథంలోనుంచి పరుగెత్తి పరుగెత్తిపోయింది. చెట్లూ, చేమలూ, అవన్నీ తలక్రిందులై పోయినయి. నేను ఆకిటికీలోనుంచి తల బైటికిపెట్టి చూస్తునేఉన్నాను. అన్నీ నాకుదూరమైపోయినాయి. బంధువులూ, స్నేహితులూ, పరిచితులూ అందరూ, ఒకక్షణంలో దూరమైపోయినారు. నేనొకకట్టెనైపోయినాను.

ఈకొయ్యబొమ్మ ఆరైల్లోఎంతదూరంప్రయాణంచేసిందోఏయే స్టేషనులలోరైలుదిగి, రైలుఎక్కిందో; ఏమిటో తెలియదు. తరువాత ఏవూరుకారు ఎక్కిందోకూడా తెలియదు. కూర్చున్నాను కారులో ఎక్కడికో వెళ్ళిపోతున్నది కారు. వేగంగాలాక్కొని వెళ్ళుతూన్నది. వెళ్ళింది. వెళ్ళింది; వెళ్ళింది; ఎక్కడికో వెళ్ళింది ఆగింది ఒక నిర్జనప్రదేశంలో. మానాన్నగారు ముందుకుదిగి నన్ను దింపారు. నన్నొక చెట్టుకింద

కూర్చోబెట్టారు కూర్చోమన్నారు, కూర్చున్నాను. అప్పటికి మూడుగంటలైంది. సుమారు అయిదుగంటలకు మరో కారు వచ్చింది నాతో ఏకబురూ చెప్పకుండా ఆకారులో ఎక్కి మానాన్న గారు తిరిగి వచ్చినదారినే ఇంటికి వెళ్ళిపోయినారు నేను అక్కడ ఎంతసేపు ఉన్నానో ఏమో నాకేమీ తెలియదు నాకునిద్రపట్టిందో లేక మెలుకువతో ఉన్నానోకూడా చెప్ప లేను.

చివరకు ఏదో చిన్న కారు నాకుదగ్గిరగా ఆగటం-డబ డబమని శబ్దంకావటం మొదలైన విషయాలునన్ను ఆస్థితిలో నుంచిబైటపడేసినవి. నేను కళ్ళెత్తి చూసాను. పడుకొనే ఉన్నాను. నాముందు ఇద్దరు మనుష్యులు నిలబడివున్నారు. అందులోఒకరు పొట్టిగానూ, నల్లగానూ, ఉన్నారు. రెండవ ఆయన ఎర్రగానూ, లావుగానూ ఉన్నారు. వేషాలనుబట్టి వారు పెద్దమనుష్యులని నేను ఊహించగలిగాను. అప్పటికే సూర్యుడు అస్తమిస్తున్నాడు నాకెదురుగా. పశ్చిమదిక్కు విరి యబూచిన గులాబితోట అయిపోయింది. ఆకాంతులు నా ముఖంపై పడుతున్నాయి. చల్లగాలి వీస్తున్నది. పక్షులు జంట లుగా పరుగెత్తుతున్నాయి ఆకాశంలో.

దిక్కూ మొక్కూలేని ఆనిర్జన ప్రదేశంలో నాకెటు వంటి అన్యాయం జరిగేదో ఆపెద్దమనుష్యులు దేవతలలాగ ఆ వేళకు రాకపోయినట్లయితే. చనిపోయేదాన్ని కాదూ గాని ఆగచాట్లపాలు అయ్యేదాన్ని .

ఆవచ్చిన ఇద్దరిలో ఒకాయన డాక్టరని నాకు వెంటనే తెలిసింది. ఎల్లాగా అంటే, ఆయన జేబులో ఉన్న స్టెతస్కోపు బైటికి కనిపిస్తూఉంది. ఆడాక్టరుగారు ఆరెండో పెద్దమనిషిని మాష్టరుగారూమాష్టరుగారూ అని మాటిమాటికిసంబోధిస్తూ ఉండడం మూలానా ఆయన ఏదో మాష్టరు అయివుంటాడను కొన్నాను. అయితే ఆయనస్టేషన్ మాష్టరో, పోస్టుమాష్టరో నాకు తెలిసిందికాదు. నేను వాళ్ళవైపుచక్కచూస్తున్నానో లేదో ఇంతలో నాకళ్లు మూతలువేసుకొనిపోయినవి. నాకేమి మూర్ఛా రాలేదు, తెలివీ లేక పోలేదు. అన్నీ తెలుస్తూనే ఉన్నాయి. వాళ్ళుఅనుకుంటూన్న మాటలన్నీ వినిపిస్తూనే ఉన్నాయి వాళ్లుపడుతూఉన్న ఆదుర్దాఅంతా గ్రహిస్తూనే ఉన్నాను. కాని లేచినిలవడటానికిగాని, నోరువిప్పిమాట్లాడ టానికిగాని బుద్ధిపుట్టలేదు శక్తిలేకుండాఉండి ఉంటుంది.

అందులో డాక్టరుగారుమటుకు నాచెయ్యి పట్టుకొని నాడిపరీక్షించాడు. నాకంతా తెలుస్తూనేఉంది. కాని ఎందు చేతనోఆక్షణంలో నాకళ్ళవెంటకన్నీరు కారినాచెక్కిళ్ళపైగా జారుతున్నాయి. నాస్థితి వాళ్ళకు జాలికలిగించి ఉంటుంది. ఏ బిడ్డలు గన్నతండ్రికిజాలివెయ్యదు! డాక్టరుతనస్నేహితుడితో ఏదోఅన్నాడు. ఆమాస్టరు చాలా ఆదుర్దాపడుతున్నట్లు, ఆ యన అప్పుడప్పుడు అంటూన్న మాటలనుబట్టి గ్రహించ గలిగాను.

ఇప్పుడు ఆలోచించుకొంటే తెలుస్తుంది— వాళ్ళిద్దరిదీ జాలిగుండే. కాని సహజంగా డాక్టరుకు ఉండవలసిన ధైర్యం ఆయనకు ఉంది; మాష్టరుగారిది దుర్బలహృదయం.

"ఇద్దరం పట్టుకొని ఎత్తి ఈమెను కారులో కూర్చో బెడదామా? కారులోకూర్చోలేదేమో! పోనీ,...చూడండి డాక్టరుగారూ, నేనిక్కడేవుంటాను. మీరుచప్పున చల్లపల్లి వెళ్లి మేనా ఒకటిమాట్లాడితీసికొనివస్తారా?" అని ఏమేమో అన్నారు, పాపం ఆమేస్టరుగారు

ఇంతసేపూ, డాక్టరుగారు నా గుండెలను పరీక్షిస్తు న్నారు. తరువాతఆయననాడినిగూడపరీక్షించి "మరేమీఘర వాలేదు. మీరనుకున్నట్లు ఈమెఇప్పుడు మూర్ఛలో లేదు. తెలివిగానేవుంది. అయితేచాలా బలహీనంగా వుంది. అంత కంటే మరేమి ప్రమాదస్థితిలేదు" అని అన్నారు.

నన్ను కారులోకి తీసుకొని పోవాలని ఉద్దేశించి. "అమ్మాయీ లేఅమ్మా" అంటూడాక్టరుగారు నాకుచేతిని ఊతగా ఇచ్చారు. ఆ మాస్టరుగారు నావెనుకనుజేరి, నా నడుముచుట్టూ తన రెండుచేతులనుచుట్టి, నన్ను పైకిలేవ నెత్తటానికి ప్రయత్నంచేయబోతున్నాడు. నేనుడాక్టరుగారి చేతిలోనుంచి, నాచెయ్యిలాక్కొని, నానడుముచుట్టూ వెన వేసిఉన్న చేతులను తీసివేశాను! ఆచేతులు నన్ను తాకటం నాకిష్టం లేదని స్పష్టంగా తెలియపర్చాను. డాక్టరుగారు ఇంగ్లీషులో ఏదో అన్నారు బహుశః నన్ను తాకవద్దనిఅయి ఉంటుంది. వెంటనే రెండో ఆయన వెనుకనుంచి లేచిముందుకు వచ్చినుంచుని ఊరుకున్నాడు. డాక్టరుగారూ "లే, అమ్మా

అన్నారు. అమ్మాఅన్నశబ్దం నాశరీరాన్ని పులకరింపజేసింది. మాఅమ్మ, మానాన్న, అన్నయ్యపిల్చినట్లుగాఉంది పిలుపు. కళ్లెత్తిదీనంగాచూశాను. "లేఅమ్మా, నీకేంభయంలేదు." అన్నాడు.

నేను లేవబోతున్నాను. ఇంతలోడాక్టరుగారు "ఉండు అమ్మా! ఉండు. ఒక్క నిమిషంఉండు, లేద్దువుగాని" అనికూర్చోమన్నట్లుచెయ్యిచూపారు. నాకప్పటికి సంగతులన్నీ బాగా తెలుస్తున్నవి. కళ్ళుబాగా తెరిచిచూచాను. డాక్టరుగారి కరస్పర్శలోనిమహాత్మ్యంబయటపడ్డది. అతఃపూర్వం దిక్కులేని స్థితిలోఉన్నా నేఅన్నభావం, నాధైర్యాన్ని చంపినన్ను రాయిజేసింది. వారిదయగలకరస్పర్శవల్లా 'అమ్మా' అన్నపిలుపువల్లా నా బేలతనం నిస్పృహావిడిపోయినవి. నాకెంతో ధైర్యంకలిగింది.

చక్కగాచూశాను ఆఇద్దరు పెద్ద మనుష్యులనూ. ఇంతలోమాస్టరుగారు ఫ్లాస్కు ఒకటి తెచ్చి డాక్టరుగారికిఇచ్చి కప్ ఒకటి పట్టుకొని మౌనంగా నుంచున్నారు. డాక్టరుగారు ఆకప్పులో వేడివేడి టీ పోశారు. పొగలువస్తున్నాయి. కమ్మని వాసనకూడావచ్చింది. మాస్టరుగారిచేతిలోనుండి తీసికొని, డాక్టరుగారుఆకప్పు నాకు ఇవ్వబోతున్నారు. ఇంతలో నేనే నా చెయ్యిజాపాను. ఆపానీయంకోసం, ఆయన నన్ను పుచ్చుకోమని కోరకుంటానే.

ఆమాస్టరుగారు 'తాగండి' అన్నాడుఆయనఅల్లాగన్నా నేనెందుచేతనో డాక్టరిగారివైపు తిరిగి. "పుచ్చుకోనాండీ ?

అన్నాను. అల్లాఅనటం ఆయనకు అమర్యాదచేయటం అని
నాకు తోచలేదు.

ఆయనడాక్టరుగారితో "డాక్టర్! ఈమెభీమవరం తణు
కూ ఆవేపుమనిషి అయిఉంటుందండి" అన్నాడు. ఎల్లాగ్రహిం
చారోమరి. నామాటలో యాసనుబట్టి ఊహించారని తరు
వాత గ్రహించాను.

నేను కొద్దికొద్దిగా ఆ టీ పుచ్చుకొన్నాను. "ఇంకా
కొంచెం" అన్నారుడాక్టరుగారు. నేనువద్దు అన్నాను. కాని
ఆయననాచేతిలో ఉన్నకప్పును మెల్లగా తీసుకొని దానిలో
మరికొంచెం 'టీ' పోసి పుచ్చుకోఅమ్మా అన్నారు. నే మళ్ళీ
వద్దండీఅన్నాను. "అల్లాగకాదు. పుచ్చుకోఅమ్మా. పుచ్చుకో
వాలె" అన్నారు, మందుఇస్తున్నవారివలె. ఆయనమాటఆజ్ఞ
అయిందినాకు. మాట్లాడకుండా పుచ్చుకున్నాను. నూతన
శక్తికలిగిందినాకు. నరాలకు బలంవచ్చింది. కళ్ళుపూర్తిగా
విప్పి చూడగలిగాను. నాయెదుటనున్న ఇద్దరు పెద్దమనుష్యు
లను బాగుగ గుర్తించాను.

ఆడాక్టరుగారు యౌవనంలోఉన్నారు. చక్కనిచాయ
గలశరీరం. బిరుసైన నెరిసినజుట్టు. ఆముఖం తేజోవంతంగా
ఉండి సౌమ్యస్వభావాన్ని తేటపరుస్తున్నది.

ఆరెండోఆయన నల్లనివాడు—కాని పద్మనయనంబుల
వాడుకాడు. డాక్టరుకంటే కొంచెం పెద్దవాడు వయస్సులో.
మీసంలో నెరిసినకొన్ని వెంట్రుకలు తళతళ మెరుస్తున్నాయి

ఆయన చూపులకు సామాన్యరూపసి అని అయినా అంటానికి వీలులేదు. గాని, ఆమధ్యకు విడిపోయిన ఉంగరాల జుట్టు మాత్రం కొంచెం అందంగా ఉంది. పెదవులు ఎర్రగా గన్నేరు పువ్వురంగులో ఉన్నవి. కళ్ళలో జాలి కరుడుగట్టినది. ఆరూపులో దయాదాక్షిణ్యాలు ద్రవించినయి జీవితంలో బాధలు పడుతూన్న వ్యక్తిలా కనుపించాడాయన మౌనంతో, ధైర్యంతో, అనివార్యంగా వచ్చిన బాధలను భరించగల గుండె నిబ్బరముగల మనిషిలాగ లేడాయన. ఆయనను చూస్తే నాకు జాలివేసింది. నన్ను జూచి ఆయన ఎంతో బాధపడుతున్నట్లు ఆముఖ కవళికల వలని తెలుస్తూనేఉంది, నాకున్న గుండెనిబ్బరమైన ఆయనకు లేనట్లునాకు తోచింధి. ఆయన లోని జాలి, బేలతనమూ ఆయన ముఖంపైన కనబడుతునే ఉన్నయి. ఆహృదయంలోని బీట్లు, దయార్ద్రిత నామనః చక్షులకు గోచరించినవి.

ఆయనపిచ్చి చూపులుచూస్తూనుంచున్నాడు. డాక్టరు గారు నన్ను ఉద్దేశించి "లే అమ్మా రా, నాకారులో నిన్ను తీసుకొని పోయి, మేము నిన్ను సురక్షితమైన స్థలానికి చేరుస్తాము. నేను దేవదత్తమైన సహోదరుణ్ణి అనినమ్ము" అన్నారు. 'నమ్ము' అన్నమాట ఇంకోసారి అనటం అవసరం లేదని నాకుతోచింది. శక్తి ఉంది లేవటానికి. ఆయనచేయి సంజ్ఞాపూర్వకంగా మాత్రమే నాకు ఊత అయిందికాని నిజానికినాకు సహాయం అక్కరలేదు నానడుముపైన చేయవేసి,

ఆయననన్ను కారువద్దకు నడిపించుకొని వెళ్ళాడు. ఈమాటు నానడుముపై బడ్డ చేతిని తీసేద్దామన్న బుద్దినాకు పుట్టలేదు. ఆస్పర్శ నాకు తియ్యనిమనిస్థితిని, శాంతిని ఇచ్చింది. ఆయన ఇంకా గాఢంగా కావలించుకుంటే నేనుఇంకా ఉత్సాహాన్ని పొందేదాన్ని. కారుతలుపుతీసి నన్ను వెనుకసీటులో కూర్చోపెట్టారు. అక్కడ నేను ఆనుకొంటానికి వెనుక బాలీసూ, కాలిక్రిందకూడా మెత్తనిదిండూఉన్నవి. చాలా సుఖంగా కూర్చున్నాను. చెట్టుక్రిందఇసుకలో గుడ్డలమూటపైన తల మోపి, అసహాయనై దిక్కులేక పడియున్ననాకు ఈనూతన స్థితి వింతమైతోచింది. ఏమైపోయేదాన్నో ఈడాక్టరుగారు రాకపోతే......

కారు కదలింది. చక్కగా కుదుపులేకుండా ఎగిరి పడకుండా చల్లనిగాలికి నడిచే పడవలాగ కారు జారిపోయింది.

## ఆయన

డాక్టరుగారూ నేనూ స్నేహితులము. జీవితంలో వస్తూఉండేఅనివార్యసన్నివేశాలలో ఒకటి మమ్ముల నిద్దరిని దగ్గరకులాగింది. మాజీవితవీణలు ఒక్క విషాదస్వరంలో ఏకశ్రుతిని పొందినయి. అది భార్యా వియోగదుఃఖము.

ఆరోజున నేను డాక్టరుగారియింటికి మధ్యాహ్నము ఒంటిగంటకే వెళ్ళాను. చల్లపల్లిలో టీపార్టీ ఉందనీ, నన్ను కూడాతన వెంటరమ్మని వారు ఆహ్వానించారు.

నాకు ఆ సందర్భములో ప్రత్యేకాహ్వానము లేక పోయిన ఆరోజు ఆదివారమై నాకేమీ పనిలేక ఉన్నకారణాన వారు చెప్పిందానికి సమ్మతించి, వారి కారులోవెళ్ళాను. టీపార్టీ నాలుగుగంటలకల్లా అయిపోయింది. స్నేహితులు అంతా పిచ్చాపాటీ, మాట్లాడుకొంటూ కూర్చున్నారు. వారిలోముఖ్యమైనవారు డాక్టర్లు అవటంచేత, సంభాషణ చాలవరకు వైద్యశాస్త్రవిద్యలకు సంబంధించినదై నాకంతగా రుచించలేదు. నేను లేచి బైటకు వచ్చాను.

అప్పుడే బస్సు ఒకటి బందరునుంచి వచ్చింది. బస్సులో దిగినవాళ్ళు ఆశ్చర్యంగా చెప్పుకుంటున్నారు: ఎవరో ఒకస్త్రీఅక్కడికి రెండుమైళ్ళదూరంలో ఒకచెట్టు క్రింద స్పృహతప్పిపడిఉన్నదనీ, పాపం పూర్ణగర్భిణిఅనీ, వెంటనేబాధ్యతగలవారు ఆమెకుసాయం చేయకపోతే ఏదైనా ఆపదరాగలదనీ, పోలీసువారికి రిపోర్టుచేయటం ఉత్తమమనీ, ఏమేమో చెప్పుకుంటున్నారు. ఆమాటలు వినేసరికినాకూ ఆ అపరిచితవ్యక్తి ఉన్నదీనావస్థను గురించి జాలికలిగింది. వెంటనే లోపలికిపోయి స్నేహితులతో కులాసాగా కబుర్లు చెప్పుకుంటూ ఉన్న డాక్టరు గారిచెవులో ఈ విషాదవార్త వేశాను ఎంతోఉద్వేగంతో. ఆయన తొణకలేదు, తన జీవితంలో అట్టిదుస్థితిలోనున్న దురదృష్టవంతులను తరుచుగా చూస్తున్న వాడివలె చాలా ఉదాసీన భావంతో నామాటలు విని, రెండుమూడునిమిషాలలో తనసంభాషణ పూర్తిచేసి చెయ్యిపట్టుకొని, బైటకు తీసు కొనిపోయినారు. నేనూ

"డాక్టరు. పాపము ఆమనిషి ఎవరోనండి మనం వెళ్ళి చేయ గల సాహాయ్యము చేద్దామండీ" అనివెంతో ఆదుర్దాగా అన్నా విననట్లునటిస్తూ వీధిలోకిపోయి. తనకారునూ స్టార్టు చేసి నన్నుఎక్కమన్నట్లు చూశారు. నేసూగ్రహించి ఎక్కి కూర్చున్నాను. కారును రంయిమని వేగంతో బందరు వైపునకు నడిపినారు. ఆస్థితిలోఉన్న స్త్రీ ఎవరో అనినాకు ఆదుర్దాఎక్కువై, కారుకంటె హృదయం ఎక్కువవేగంగా పరుగెత్త సాగింది. దూరాన ఉండంగానే, ఒకచెట్టు క్రింద, ఆకుపచ్చనిచీర గట్టుకొని పడుకొనియున్న వ్యక్తి కని పించింది. అప్పటికిఆమె అరమైలుదూరంలో ఉండిఉంటుంది. కాని ఆఅరమైలుదూరం కారువెళ్ళటానికి అరగంట పట్టినట్లు తోచింది.

ఆమెకు సమీపంలో కారును ఆపి ఆమెను కారులో ఎక్కించు కొన్నాము. బందరు చేరాము: మాఇంటికే తీసు కొనివచ్చాముకాని, ఆమెకు ఎవరు పురుడు బోస్తారా అన్న సమస్యనమ్ములను బాధింపసాగింది.నాకొంప అతఃపూర్వమే కూలిపోవటం మూలాననాకు ఆడదక్షతలేదు. డాక్టరుగారి ఇంట్లోఉంచితే ఉంచవచ్చు కాని ఆపిల్లలతల్లికి ఈమెబరువు కావచ్చు. ఏఅమ్మ ఈబరువును మెడజుట్టుకొంటుంది? ఒకనెల రోజులుమాయింట్లోఉంది. సమస్తం ఇంట్లోఉన్నాయికాబట్టి ఆవిడేఇంతవండి పిల్లలకుపెట్టి, తానూతినేది. ఆనాలుగు రోజు లూకాస్తకమ్మని తిండితిన్నారు పిల్లలు. కాని ఎక్కువకాలం ఆమె మాఇంట్లో ఉంటే ఇతరులు ఏమంటారో అని భయం

ఆ కథాపఠనమే నా భావనాశక్తికిఉత్తేజంకలిగించి, నామాన సికప్రవృత్తిలో విప్లవాన్ని తీసుకొనివచ్చింది. వానిలో చలం గారి కథలు నన్ను ఎక్కువగా ఆకర్షించినై. అతఃపూర్వము నేను పతితను, మహాపాపిని. నేను చేసినదుష్కృతి నాహృద యాన్ని నిరంతరమూ కత్తిరిస్తూఉండేది. నానిర్భాగ్యహృదయం భరించలేని వేదనాగ్నిలో దగ్ధమైపోతుండేది. మరణమే నాకు శరణ్యమని భావిస్తుండేదాన్ని, ఆ కథలు చదివినతరువాత నా ఊహాలో మారినవి. నేను పాపిని కాదు. సామాన్యస్త్రీకిఉండే పిపాసనే నేనూ తృప్తిపరచికొన్నానేకాని అమానుషమైన కార్యాన్ని దేనిని చేసియుండలేదు. నాకూ, ఈప్రపంచంలో బ్రతికి ఉండటానికి హక్కుఉంది. తావు వెతుక్కోవాలె, అని తోచింది. తరువాత మునిమాణిక్యమువారి కథలు చదివాను. నాకోరికా, నాతృష్ణా, సహజమైనవేకాని వాటినితృప్తిపరచు కొనేసన్మార్గం చలంగారు చూపలేదూ, వీరుచూపారు, అని పించింది. పవిత్రమైన వైవాహికజీవనంలో స్త్రీ పురుషులు భార్యాభర్తలై సుఖించటమే పరమోత్కృష్టమైన జీవితమని నాకు బోధపడ్డది. ఆకథలలోని భార్యాభర్తల అనురాగసల్లా పాలు చదివినప్పుడు అట్టి అదృష్టం నాకీజన్మలో ఉంటుందా అనిపించింది. పిల్లల అల్లరీ, తల్లిదండ్రులకు పిల్లలపై నుండే ప్రేమా, ఇవన్నీ చదువుతూన్నప్పుడు నాకుకూడాపిల్లలు కావా లని కోరికపుట్టింది. అంతకుముందు నాగర్భంలో ఉన్న బిడ్డ యందు నాకు రోతగాఉండేది. నాకు ప్రేమ కలిగింది. కొద్ది

వేసింది. ఇటువంటి స్త్రీలకై ఏర్పడ్డసంస్థ బెజవాడలో ఒకటి ఉందని తెలిసి అక్కడికి ఉత్తరం వ్రాశాము.

## ఆమె

నేను మాస్టరుగారింట్లో ఉన్న నెలరోజులలో నిత్య దుఃఖితనైన నానిర్భాగ్యపు బ్రతుకులో ఆశాలత ఎలాజన్మించినదీ, నామనఃప్రవృత్తిలోఎలా మార్పు గలిగినదీ కొద్దిగా చెపుతాను. మాస్టరుగారు చాలా దయగలవారు. నన్నెంతో ఆదరణతో చూశారు. ప్రొద్దుటిపూట ఫలహారమూకాఫీ,అవీ తెప్పించి ఇచ్చేవారు. నేనే వంటచేసి పిల్లలకు పెట్టి, నేనూ తినేదాన్ని. ఆయనమాత్రం హోటలులో భోజనంచేసేవారు. మధ్యాహ్నంకొద్దిగారొట్టె. ఒకకప్పుపాలు, నేనూ పిల్లలూ కూడా పుచ్చుకొనేవాళ్ళం. చీకటిపడినవెంటనే పిల్లలకుఅన్నం తినిపించి, నేనుకూడా పాలూఅన్నం తినేదాన్ని. రాత్రి ఎనిమిదిన్నరకు అందరమూతలో నారింజపండూతినేవాళ్ళం. ఇన్ని విధాల వారు నాకు సదుపాయాలు ఏర్పరచినారు. దాసీది నన్ను అహర్నిశలు కనిపెట్టుకొనిఉండేది. జమీందారిణికిమల్లె జరిగింది నాకు ఆ నెలరోజులునూ.

పగలంతా ఆయనఇంట్లోఉండేవారుకానేకాదు. నేనూ పిల్లలూఉండేవాళ్ళం. నాకు ఊసుపోవటానికి ఆయన కొన్ని పుస్తకాలు ఇచ్చారు. అవన్నీ కథలపుస్తకాలు. ఆ కథలన్నీ కూడా సంసారిజీవితాన్నిగురించి ప్రసిద్ధరచయితలువ్రాసినవి.

రోజులలో ఆబిడ్డనుకని పెంచుకోవాలెనన్న ఉబలాటంఎక్కు-వైంది పొద్దస్తమానం చదువుక్కోటంతోనూ పిల్లలవిషయమై చూడటంతోనూనాకు సరిపోయేది. రాత్రిళ్ళు పిల్లలూ నేనూ ఒకగదిలోనూ, ఆయనప్రక్క-గదిలోనూ నిద్రించే వాళ్ళం. అప్పటికి నాకు ఆయనసంగతి ఏమీా తెలియదు. ఆయనకు భార్యఉందా లేదా? ఉంటే ఇంట్లో లేదేమీా? ఆయనకుపిల్ల లెంతమందీ? అన్న సంశయాలు అనివర్తితాలుగానే ఉండి పోయినవి.

పెందరాళే ఆయన ఇంటి కొచ్చేవారు. పిల్లలు నిద్ర పోయిన వెంటనే తన గదిలోకిపోయి తలుపువేసికొని గడియ బిగుంచు కొనేవారు. స్నేహితు లెవ్వరుగాని ఆయనకోసం వచ్చేవారుకారు. తెల్లవార్లూ కాకపోయినా, చాలా ప్రొద్దు పొయేవరకు ఆయనతన గదిలో మేల్కొ-ని ఉంటూన్నట్లు నాకు అనుమానంగాఉండేది. ఏవోవిచిత్రమైన నిట్టూర్పులు వినబడేవి. ఆగదిలోఏదో విశేషం ఉందని నాకు తోచింది. ఒకరోజున ఆయన లేనిసమయంలో, చూద్దామన్న కుతూ హలంతో ఆగదిలోకి వెళ్ళాను. ఆగదిలో విస్తారముసామాను లేవీ లేవు ఒక పేముకుర్చీ, ప్రక్క-నఒకచక్క-నిబల్లాఉన్నాయి. ఒకమూలగా ఆబల్లకు మరొక ప్రక్క-న ఒకరోజెవుడ్ కుర్చీ ఉంది. ఆ టేబిల్ కు వెనకప్రక్క-మూసియున్న కిటికీలో పెద్ద నిలువు టద్దమూ దాని అడుగుభాగాన రెండు ఫోటోలూ, నిలువబెట్టి ఉన్నాయి. ఆఫోటోలు పుష్పమాలాలంకృత ములు. పుష్పమాలాలంకృతు లగుటవలన వారు దివంగతు లై యుందురని తోచింది. ఆబల్లపై ఒకస్త్రీ వ్రాసిన ఉత్తరం

చక్కని చట్రములో అమర్చి ఉంది. నాలుగుపుస్తకాలు కొన్ని పువ్వులుతప్ప అక్కడమరేమీలేవు. అవి వాడిన పొగడపూలు. ఏపుణ్యస్త్రీ కబరీచ్యుతములోఅవి !!

గోడలకు రెండుఫోటోలుమాత్రమున్నవి. ఒక దాని పేరు "చెడ్డదినములు" ఒకవృద్ధురాలు చినిగిపోయిన పాత బట్ట కప్పుకొన్నది. చలికి గజగజలాడిపోతున్నది. ఈదురు గాలి ఆచింకిబట్టనుకాస్తా ఎగరగొట్టుతున్నది. ఆస్థితిలో ఆమె నిలువనీడలేక అల్లాడుతున్నది. రెండోది అల్లాంటిదే. అది యొక పెద్దవృక్షము. అందొక్క ఆకైనాలేదు. ఆచెట్టును ఆధారంచేసికొని జీవిస్తూన్న ఒక పక్షితనపిల్లలతో ఎక్కడికీ పోలేక, ఏమీ తోచక అల్లాడుతున్నట్లు చిత్రింపబడినది.

ఇంకొక పెద్దచిత్రముకూడా అక్కడఉంది. దానిపేరు "శిథిలగృహము" పైకప్పు కొంతవరకు లేచి పోయింది. గోడలురెండుసగంకూలినై. ద్వారబంధంబరిగింది. నలుగురు పిల్లలుబిక్కముఖాలతోగృహప్రాంగణాన ఆడుకొంటున్నారు. ఆఇంటి యజమాని ఆపిల్లలను చూస్తూ, ఒక బండపై మూర్తీభవించిన, దుఃఖదేవతవలె కూర్చొనిఉన్నాడు. ఇవి విచిత్రమైన బొమ్మలనినాకుతోచింది. ఎవరైనా చక్కనిబొమ్మలను చూచుకొంటారు. ఇదేమిచిత్రం! కళాకాంతులుఉట్టిపడేబొమ్మలను చూచి ఆనందిస్తారుగాని ఎముకలనుజూచి ఎవరైనా ఆనందిస్తారా? అల్లాంటి బొమ్మలే అక్కడ ఉండటం, మరే అందమైన వస్తువులూ అక్కడలేకపోవటం, ఏదో విచిత్రము ఉంది. ఆయన హృదయావేదన ఆగదినంతా కమ్మినట్లుంది.

నాఒళ్ళుఝల్లుమన్నది. సుళ్ళు తిరుగుతూ ఉన్న శోకవాహి నిలో నేనున్నట్లు ఊహించాను. భగవంతుని సాన్నిధ్యంలో మనకు కలిగేవిచిత్రమైన భయమూ, ప్రవర్తీసంచలనమూ నాలో కలిగినవి.

నేను మామూలుగావుండే గదిలోకి వచ్చేశాను. పిల్లలనవ్వు ముఖాలూ, అందమైన చిత్రాలూ, చక్కని సామానులూ, ఉన్న ఈగదికీ బీభత్సంగా ఒడలు కంపం పుట్టించే ఆగదికీ ఎంతభేదం! ఇంతలో దాసీదివచ్చి అమ్మా ఆగదిలోకి ఎందుకెళ్ళారమ్మా మాష్టరుగారు ఆగదిలోకి ఎవ్వ రినీ రానీయరు. నేనుకూడా ఊడ్వటానికైనా వెళ్ళను. వారే స్వయంగా ఊడ్చుకొని శుభ్రం చేసుకొంటారు. ఆగదిలోకి తొంగిచూడటం కూడా కూడనిపని, అని సవినయంగా ఏదో వింత భయంతో చెప్పింది.

నాగదిలోకి నేను వచ్చానన్నమాటేగాని నన్నేదో కొత్తభయం ఆవరించుకొంది. ఈలోకంకాక మరొక భయం కరమైన ప్రపంచంలోకి పోయివచ్చినట్లు వింత వింత భావాలు నామనస్సులో పరుగెత్తసాగినయి. దేవదర్శ నానంతరం మనస్సు ఎల్లాంటిప్రశాంతభావాన్ని అనుభవిస్తుందో అలాంటి భావాన్నికొంతసేపు అనుభవించాను. తరువాత నిదానంగా ఆలోచించసాగాను. ఆపెద్దమనిషిస్థితి యేమిటీ! అల్లాంటిగది ఉండటానికి కారణం యేమిటి? ఆచిత్రాలు ఏమిటి? ఆఫొ ట్రోలు ఏమి? వానిపై పూలేమిా? అని,

ఆయనభార్య చనిపోయి ఉంటుందని నాకుతోచింది. దాసీదాన్ని అడిగాను. అది సర్వంనాకు విదితం చేసింది. ఆయనకు భార్యపోయి సంవత్సరం అయిందనీ, ఇంకా జీవితంలో అనేక దెబ్బలుతిన్న వ్యక్తిఅనీ, వృత్తికి సంబంధించిన వ్యాపకం తప్ప ఆయనకు మరోరకం వ్యాపకం లేదనీ, ఆగదిలో కూర్చుని ఎప్పుడూ ఏదో వ్రాసుకుంటూ ఉంటాడనీ అప్పుడప్పుడు కుళ్ళికుళ్ళిఏడుస్తూ ఉంటాడనీ ఎన్నోసంగతులు చెప్పింది.

అప్పుడు నాకంతా అర్థంఅయింది ఆఫోటోలు ఏమిటో ఆచిత్రపటాలూ ఏఅర్థాన్ని ధ్వనిస్తాయో బోధపడ్డది. అప్పటినుండి నాకు ఆవ్యక్తియందు జాలికలిగింది. బిడ్డలెంతమంది అన్నాను. ఇప్పుడు మిగిలి ఉన్నది నలుగురు. ఇక్కడ ఉన్నఇద్దరు మొగపిల్లలూ, పాపా కాక, ఇంకా ఒక ఆడపిల్ల ప్రస్తుతం మేనమామ వద్దపెరుగుతున్నదని ఆమనిషి వివరంగా అన్నివిషయాలు పూసగుచ్చినట్లు నాకు చెప్పేసింది.

ఆరోజున ఆయన సాయంత్రం కాళ్ళీడ్చుకొంటూ రావటం నేనుకిటికీలోనుంచి చూస్తూనే ఉన్నాను. ఆయన మొఖం కరుడుగట్టిన దుఃఖంలాగఉంది. ఆయనతో మాట్లాడటమే నాకు భయంవేసింది. పసిపిల్ల పాపనాతో ఆడుకొంటున్నది. రబ్బరుబంతిని రెండుముక్కలుగా కోసి ఆరెండుడిప్పలతోనూఒక త్రాసుకట్టి వాళ్ళఅన్నయ్యఇచ్చాడు. ఇసుక ఒక

చిన్న బుట్టలో పోసుకొని వచ్చి నాముందు పెట్టుకొని ముద్దువచ్చేమాటలతో నన్ను పలకరిస్తూంది. దమ్మిడీకి ఇంత యని మేము బేరం పైసలుచేసుకొన్నాము. త్రాసుతో తూచి నా ఒళ్ళో పోస్తున్నది ఇసుక. ఎప్పటి దమ్మిడీ అప్పుడే ఇచ్చేయాలట! అల్లాగేఇస్తున్నాను. అప్పటికిమూడు దమ్మిడీల ఇసుక నావళ్ళోపోసింది.''అమ్మాయీ!ఇది మంచి తెల్లఇసుక కాదు. మట్టికలిసింది. నీవు దగాకూడ చేస్తున్నావు. అదీకాక నీవుకాస్త అయినా మొగ్గు చూపటంలేదు. బంగారంలాగ తూస్తున్నావు. తూకంలోకూడా మోసంఉన్నట్లుంది. ఇల్లాగ అయితే నేపుచ్చుకోనుసుమా! మంచి తెల్లటి మల్లెపూలాంటి ఇలుక తెస్తేనేకాని ఇకనుంచి పుచ్చుకోను'' అని నేను అంటు న్నాను. ఆయనవచ్చినిలబడిఉన్నారనిచూచినా నేనులేవలేదు. ఎందుచేత నాకా బుద్ధి పుట్టలేదు.

''బంగారంలాంటిఇసుక. మీాకనిచౌకగాఇస్తున్నాను. త్రాసులో ఏమీా మోసం లేదు. కావాలంటే ఎవరికైనా చూపించు'' ఆమాటలంటూ పాపనిక్కచ్చిగా కజ్జా ఆడుతు న్నది. ఇంతలోకేవాళ్ళనాన్ననుజూచి, ''నాన్నా ఈత్రాసు మంచిదికాదునాన్నా?ఇదితప్పుత్రాసా?''అనిఅడిగింది. ఆయన త్రాసునుపరీక్షించి త్రాసుకేంనిఖార్సుఅయిన త్రాసు అనీ, బంగారం, నవరసులూ, తూచినా తభావతు రాదనీ చెప్పారు. దానితరువాత, వాళ్ళనాన్నకు ఆ ఇసుక అమ్మజూపింది. రెండు తూనికల ఇసుక తనజేబురుమాలలోపోయించుకొని, ఒకఅణా

పాపచేతిలో పెట్టి ఆయన గదిలోకి వెళ్ళిపోయినారు. ఆ అణా దొరకటంతోనే పాప ఆఇసుకఅంతా చప్పున అక్కడ పార బోసి, చిన్నఅన్నయ్యను తీసుకొని దగ్గరలో వున్నకొట్టుకు కామాలువెళ్ళిపోయింది. తల్లి లేని ఆపసికూనలను జూస్తే నాకు అపరిమితమైన జాలివేసింది. వాళ్ళ ఆటలుజూచి ఆనం దించటానికి, వాళ్ళముద్దుమాటలువిని మురిసిపోవటానికి తల్లి లేదుగదా! తండ్రికేం తెలుస్తవి ఇటువంటి ముద్దూ మురిపా లూనూ! అని నే నెంతో విచారించాను. పనిదానిని పిలిచి ఆఇల్లుఊడ్పించి కడిగించి ముగ్గువేశాను.

## ఆ య న

ఒకరోజున నేనుమామూలుగానే సాయంత్రం ఇంటికి వచ్చాను. నేనువచ్చేటప్పటికి ఆమెపసిపాపతో ఆడుకొంటు న్నది. ఆనిరాభరణసుందరినిచూస్తూ క్షణకాలం నిలబడ్డాను. ఆమెతలెత్తి నావంక ఒక ముహూర్తకాలంచూచి, చప్పున తలవంచేసుకొంది. ఆమెసర్వాంగములలోనూ ఉత్సాహము ఉబుకుతూన్నట్లు నాకుతోచింది.

ఆవిడఒడినిండాఇసుక. కట్టుకొన్న తెల్లటిఉప్పాడజరీ చీరెఅంతామాసిపోయింది. ఆదుమ్ము ఆమెముఖంనిండాపడ్డది. పిల్లలసంతోషమే ప్రధానంగాఎంచివాళ్ళతో అంత 'సరదాగా' అంత హృదయపూర్వకంగా, అంతకలిసిమెలసి మనం ఆడుకో

లేము. తల్లి చనిపోయినతరువాత మాపాప ముఖాన అంత సంతోషం నృత్యంచేయటంనే నెప్పుడూ చూడలేదు. దాన్ని దానిబట్టలనూ పరిశుభ్రంగా ఉంచమని పనిచేసేదాన్ని నేను కఠినంగా శాసించాను. పిల్లదాన్ని మట్టిలో అదెప్పుడూ ఆడ నిచ్చేదేకాదు. ఒక వేళ ఆడటం సంభవించినా నన్ను జూడ టంతోనే పిల్ల ఆట ఆపివేయటమూ, నేను దాసీదాన్ని పిలిచి కోప్పడటమూ, వెంటనే దాన్నిబట్టలు విప్పించి క్రొత్తబట్టలు కట్టించటమూ, అది బిక్క ముఖం వేసుకొని నావంక చూడ టమూ మామూలుగా జరిగేవిషయాలు. ఈరోజున అది అత్యంత ఉత్సాహంతో ఆడుకున్నది. దాని ఉత్సాహాన్ని జూచి నేను ఏమీ అనలేకపోయినాను. ఆవిడ కూడా పసి పిల్లతో పాటు దుమ్ములో ఆడటం ఆపసిదాని సంతోషానికే కదా అన్నవిషయము నా మనస్సును కలచివేసింది.

సాయంత్రం అయింది. ఆరోజు ఎందుచేతనో వీధిలో దీపాలు వెలగలేదు. చీకట్లు కమ్ముకున్నాయి. పైన ఆకా శంలో నల్లటిమబ్బులు దగ్గరదగ్గరగా చేరుకొన్నవి. ఇంతలో చలిగాలి వీచింది. చినుకులు ప్రారంభమై, ఈడ్చికొట్టింది వాన. నేను అంతవరకు నాగదిలో మాఇల్లు ఖాళీచేసి వెళ్ళి పోయిన నాబిడ్డఫొటోముందు కూర్చుని. 'ఏడ్వగలిగినంతసేపు' ఏడ్చి పిల్లలు ఏంజేస్తున్నారో చూద్దామని గదిబయటకు వచ్చాను. పిల్లలూ ఆవిడా వంటఇంట్లోఉన్నారు. ఆమె కం చాలముందు కూర్చుని అన్నంకలిపి తినిపిస్తూ కథలు చెప్పు

తున్నది. మాపిల్లలుకథలంటే చెవికోసుకొంటారు. కథచెప్పందీ అన్నముతినరు. నిద్రపోరు. వాళ్ళమ్మ చనిపోయే రోజున కూడా మేకకథ చెప్పి నిద్రపుచ్చింది. ఆమెవెళ్ళిపోయి నప్పటినుండి ఓపికగా కథ చెప్పటానికి నాకు ఎవ్వరూ లేక పోయినారు. నాకంతఓపికా, శాంతమూ, సహజంగా లేవు. అదీకాక వంటపూటి ఇంట్లో తింటూంటే కథలు చెప్పుకుం టానికి వీలు ఎక్కడుందీ? ఆరోజున ఆమె ఆకుపచ్చని చీర గట్టుకొని ఆపిల్లలకు అన్నముతినిపించడమూ, వాళ్ళుచెవులు నిక్కపొడుచుకొని వింటూ సంతోషంతో తృప్తిగా తింటూ ఉండటమూ, చూసేసరికి నాకు పూర్వపు సుదినాలు జ్ఞాప కంవచ్చి దుఃఖం ఆపుకోలేక పోయినాను.

ఏవోవింత భావాలునామనస్సులో మొలకలెత్తినవి. నా పిల్లలకు అన్నం తినిపించేటంతటిదయ ఈమెకు ఎందుకు కల గాలె? ఎవరు ఈమె? చనిపోయిన తల్లిని పిల్లలకు నే నియ్య లేను. అట్టి పవిత్రమైన నిండుప్రేమనూ ఇయ్యలేను. ఇట్టి దయనైన వాళ్ళు అనుభవించేటట్టు నేస్తేవాళ్ళ జీవితాన్ని కొంతవరకు కాకపోతే కొంతపరకైనా మధురంగా చేయగలు గుతా నేమో అని పించింది.

ఈమెగాని మరొకరుగాని పిల్లలపై నాకంటె ఎక్కువ ప్రేమను జూపగలరా? నా ప్రేమ చాలదా పిల్లలకు? అని మళ్ళీఅనుకొన్నాను. కాని ఆ దృశ్యాన్ని జూచి నా అభిప్రా యాన్ని మార్చుకోవలసివచ్చింది. గంట—అంటేపక్కా గంట కూర్చుని, తీరికగా కథలు చెపుతూ, పిల్లలకు అన్నంతినిపించే

ఈ దృశ్యము మళ్ళీనామనస్సును కలతపెట్టింది. ఇంత ప్రేమాఉండికూడా, అల్లా చెయ్యాలని నాకుతోచలేదుగదా ఆమెఎందుకట్లా చేయగలిగింది ? నాకంటె ఎక్కువ ప్రేమచే కాదు. పురుషునికి తోచనివీ, స్త్రీ ప్రకృతికిమాత్రమే సహజమైనవీ కొన్ని ఉన్నాయి. పురుష ప్రకృతిలో లేని మార్దవమూ, తియ్యదనమూ స్త్రీ పకృతిలో ఉన్నవి. పగలూ రాత్రీ రెండూ సంతోషదాయకములే. కాని రాత్రిఇచ్చే ప్రశాంతిని పగలు ఇయ్యలేదు. పగలు ఇచ్చేచైతన్యాన్ని రాత్రి ఇయ్యలేదు. అల్లాగే పిల్లలకుకూడా పురుషుడుచూపే గంభీరమైన ప్రేమా కావాలె. స్త్రీఇచ్చే మధురమైన వాత్సల్యమూ కావాలె. ఇందులోఏదితక్కువైనా వాళ్ళజీవితానికి తీరని కొరత. అట్టికొరతలోపెరిగిన బిడ్డప్రకృతి, మార్దవరహితంగాఉంటుంది: అట్టివారి జీవితంలో తీపిఉండదు. నా పిల్లలకు తల్లి లేనిలోపముతీర్చడం మానవుని శక్తికి మించినది. కానివాళ్ళజీవితాన్ని కొంతమధురంగా చెయ్యకూడదా అన్నభావం నామనస్సులోజన్మించింది. ఆగాడాంధకారంలో తెల్లటిమెరుపొకటి చీకట్లను చీల్చుకుంటూ పరుగెత్తిందికాని అదిఎట్లుసాధ్యం ? మళ్ళీఇందాకటి ఆలోచనే ! ఏమది ? దయార్ద్రహృదయురాలైన, ఒక్కశీలవతినినాభార్యస్థానాన్ని ఆక్రమించ నియ్యాలె. మళ్ళీ, నాగుండె ఝల్లుమన్నది. ఎక్కడో ఏతిత్తులలోనోదాగుకొనిన దుఃఖంపొంగి, నాకుత్తుకదాకా ఎగతట్టి, కళ్ళల్లోనుంచి బైట పడటం మొదలుపెట్టింది. నాగదిలోకి వెళ్ళిపోయాను.

శక్తి, ఓపికా, మగవాడికి ఉండదు. అసలు ఆపద్ధతే వేరు. ఆతీరే వేరు. కాని నాకూ నాపిల్లలకూ అట్టి సౌఖ్యం ఈ జన్మకు లేదు.

"ఎంత ఓపికగా అన్నం పెడుతున్నారండీ" అన్నాను ఆవిడతో. ఆవిడ లజ్జానమ్రనేత్రాలతో నావంక చూస్తూ "ఆడదాన్ని కాదండీ!" అన్నది. నిజంగా అదే సరియైన సమాధానమని తోస్తుంది. మార్దవమనేది ఆడదాని సొమ్ము. జాలిపడటమూ, దయజూపుటమూ, స్త్రీకే సహజంగాని పురుషుడికి కాదు. ప్రేమకు ఈదయ సన్నిహితమని తోచింది. ప్రేమ శాశ్వతము. ఇది తాత్కాలికము. ఏఉపాయంచేతనైనా నాపిల్లలు ఇట్టి దయాదాక్షిణ్యాలరెక్కల్లో పెరిగితే, నా మనస్సు కొంత శాంతి పొందగలదనిపించింది. ఏమిటీ ఆ ఉపాయం ?–?

నామనస్సుకు ఒక ఆలోచన తట్టింది. వెంటనే నా గుండె ఝల్లుమన్నది. ఏమూలనుంచి, ఏచీకటి కోననుంచి, ఏ తిమిరపతి భయంకర కుహరమునుంచి, వచ్చిందోకాని ఆ ఆలోచన నన్ను ఒక్కనిమిషంకాల్చింది. భీకరమైన అగ్ని గుండంలో ఒక్కమారు ముంచెత్తినట్లయింది. బైట భయంకరంగా ఉరిమిన వురుము నాగుండెల దడదడలాగ నాకు తోచింది.

ఈఘెళఘెళశబ్దానికి పిల్లలుభయపడతారని నాకుతోచలేదు. ఆమెచప్పున పసిదాని తల ఒళ్ళోకి తీసికొని దగ్గరగా ఉన్న ఇద్దరు పిల్లలవీపులపై చేతులువేసి హత్తుకొని 'భయం లేదురా' అని నవ్వుతూ చెపుతున్నది.

తి రు మా లి గ

గదిలో నేనెంతసేపుఉన్నానో జ్ఞాపకంలేదుకాని, కిటికీ తలుపులను నెట్టివేసి బొంయిన వచ్చిన ప్రచండ ఝంఝూ మారుతమునన్ను మళ్ళీ నాఆలోచనలలోనుంచిబైటపడేసింది. ఆమెగారున్న గదిలోకివచ్చాను. ఒక మంచముపైన ఆమె పసిదాన్ని పెట్టుకొని కౌగిలించుకొని పడుకొన్నది. ఆవిడ మంచానికి ఇరుప్రక్కలామిగిలిన ఇద్దరుపిల్లలూపడుకొన్నారు. అందరూచేతికి అందికలో ఉన్నారు. పసిదిమాత్రం ఆమె డొక్కలోదూరి పడుకొంది.

నేనూ, దాన్నిరోజూపక్కలో పడుకోబెట్టు కొంటాను గాని దాన్నిడొక్కలోదూరనిచ్చే వాణ్ణికాదు. అది ఊరికే నాకుదగ్గరగా పడుకొనేది. అమ్మా అని పిలిచాను. అది తల కొంచెంఎత్తి మళ్ళీచప్పునవంచేసుకుంది "రాతల్లీ, నాదగ్గర పడుకోవ్రూ! రాఅమ్మా నాదగ్గర పండుకొందువు గాని" అన్నాను.

అదిజవాబుచెప్పక, ఆవిడకు మరీదగ్గరగా జరిగిమరింత లోతుకు ఆమెడొక్కలో అతుక్కుపోయింది. ఆమె "మీరు పడుకోండి. ఈబిడ్డను నేను పడుకో పెట్టుకుంటాను" అంది. "బిడ్డనుపక్కలోపడుకోపెట్టుకోటం మీస్థితిలోఉన్నవాళ్ళకు అపాయం" అన్నాను. "ఫరవాలేదండి" అన్నది ఆమె. "అదికాదండి, మసులుతుంది పిల్ల. తరవాత" అని ఏమో అనబోతుంటే మాటకుఅడ్డంవచ్చి "తమరు వెళ్ళండి నాకు

తెలుసు. అయినా పిల్లలు ఆడవాళ్ళను తన్నరు. ఆడవాళ్ళ పక్కలో పడుకుంటే మసలరు'' అన్నది నవ్వుతూ.

వాళ్ళనుఅక్కడవదిలేసి నేనుబైటికివెళ్ళాను. చల్లగాలి వీస్తున్నది. ఆకాశం నిర్మలంగాఉంది. మేఘాలు తెల్లబడ్డవి. మేఘాలు శ్రావణశుక్రవారపు పేరంటాళ్ళలాగ ఆకాశంలో తిరుగుతున్నాయి. వాటినిచూస్తూ నిలుచున్నాను. వానిలో కొన్ని వేగంగా నడుస్తూన్నవి. కొన్ని మందగమనంతో సంచరిస్తున్నాయి. అందొకటినడవలేక నడవలేక గర్భిణీస్త్రీ లాగ నడుస్తూఉన్నది. చూస్తూనుంచున్నాను. దానిముందు కృత్తికానక్షత్ర సముదాయముఉంది. ఆమేఘము నవ్వుతూ వచ్చి, కృత్తికను తన ఒడిలోనికి తీసుకొన్నది. ఆ నక్షత్ర సంతానాన్ని ముద్దెట్టుకొంటూన్న మేఘపుపడుచును జూచి చంద్రుడు సంతోషించి చిరునవ్వు నవ్వాడు.

ప్రొద్దున్నే లేచిఆమెపిల్లలకుస్నానాలు చేయించి మంచి బట్టలుతొడిగింది. అలమరలోకొన్ని కొత్తబట్టలు ఉన్నాయి. ఎప్పుడో తెచ్చాను వాటినినేనే; కాని వాటి సంగతే మరచి పోయినాను. కుట్టుపనివాణ్ణి పిలిపించి ఆ గుడ్డలు పిల్లలకు చొక్కాలుగా కుట్టించింది. కొత్తచొక్కాలు తొడుక్కొని పిల్లలుదిగులంతాచురచిపోయి సంతోషంగా ఉన్నారు.

నాకు ఈవిషయాలన్నీ చూస్తూంటే మనస్సుమారటం మొదలుపెట్టింది. నాభార్యచనిపోయిన తరువాత ఆస్థానాన్ని మరొక్కరికి ఇవ్వదలచుకోలేదు. కాని ఈమెప్రవర్తన నాలో క్రొత్తఉహాలను పుట్టించినది. మొదట ఆఉహాక త్తిపోటువలె

ఉన్నా, క్రమంగా ఆభావం వలన కలిగే బాధ తగ్గటమేకాక ఆ ఆలోచన కొంతశాంతినిస్తూ, అదిచివరకు ఒకబలవంతమైన కోరికగా పరిణమించింది:

కాని నాపిల్లలను ఇంత దయతో చూస్తూన్న ఆమె ఎవరో నాకు తెలియదు. ఆమె ఎవరో, ఏపూరో ఆమె పరిస్థితులెట్టివో నాకు ఇంతవరకు తెలియలేదు. ఆమె బ్రాహ్మణస్త్రీ అని మాత్రం తెలుసు. నామనస్సులోపుట్టిన కోరికను ఆమెకు తెలుపుదామని ఉత్సాహం కలిగింది.

నేనిట్లు నిశ్చయించుకొనేసరికి సాయంత్ర అయింది. సూర్యుడు అస్తమిస్తున్నాడు. లోకమంతా అంధకారంలో మునిగిపోతూన్నది. ఆచీకటులు అంతకంతకు దట్టమై పోతున్నవి. నాకోరికను ఆమెకు తెలియజేస్తే, ఆమెఒప్పుకొంటే, నాభావిజీవితం ఎల్లాగ ఉంటుందీ అన్న ఆలోచనలో మునిగియాదాలాపంగా తలపైకెత్తాను. ఒహో! ఏమి వైభవము!! ఎన్నినక్షత్రములు ఆనల్లటిఆకాశంలో మెరుస్తున్నవి!! ప్రతిచిన్నవస్తువును చూపగలిగిన ఆసూర్యకాంతి ఈఅద్భుతమైన నక్షత్రశోభను చూపలేక పోయిందేమి! ఈచీకటులు ఎట్టి అప్రతీక్షితవైభవాన్ని బయటపెట్టినవి! నాజీవితాన్ని కమ్మిన చీకటులు కూడా, ఒక అపూర్వసౌఖ్యాన్ని ప్రసాదిస్తవేమో! ఒక అపూర్వ కార్యసిద్ధికై తోడ్పడుతాయేమో...అనుకొన్నాను.

ఇంతలో నూపాప వచ్చి నన్ను కౌగలించుకొంది. ఎత్తుకొన్నాను. చంక ఎక్కి అది "నాన్నా! అమ్మ ఆచుక్క

లలోకి పోయిందికాదూ! అక్కడేనా దేవుడుండేది నాన్నా!"
అన్నది. వాళ్ళమ్మ ఏచుక్కలలో ఉందో! దేవుడు ఎక్కడ
ఉన్నాడో! అసలు ఉన్నాడో లేడో! నాకు ఏమీ తెలియ
దామె. దానిప్రశ్నలకు జవాబు చెప్పలేక బుజాన పడుకో
బెట్టుకొని జోకొట్టినిద్రపుచ్చాను. అది నిద్రపోతునే ఉంది.
నేనుమాత్రం అల్లాగ రాత్రి పదిగంటలవరకు అక్కడ నిల
బడే ఉన్నాను. ఆమెవచ్చి "ఏమండీ పంతులుగారూ! ఆ
పిల్లను ఇల్లాగఇవ్వండి, నేను పడుకో బెట్టుకుంటాను. మీరు
కూడా వెళ్ళి పడుకోండి ఎంతసేపని నిలబడతారు పాపం"
అని దయ ఉట్టిపడే మధురస్వరంతో అన్నది. నాదౌర్భా
గ్యస్థితినీ, నన్నూ జూచీ, జాలిపడిన వ్యక్తి ఇన్నాళ్ళకు ఈమె
కనుపించిందిఅనుకొన్నాను. ఆవిడా పిల్లలూ నిద్రపోయినారు
అంతులేని బరువైన ఆలోచనలతో నాకు మాత్రం నిద్ర
పట్టలేదు. ఒకరాత్రివేళ ఆమె నాగదిలోకి తొంగిచూచి
మాస్టరుగారూ! మీకు నేను చెప్పవలసినదాన్ని కాదు. కాని
మీరుఇల్లాగ విచారపడటంవల్లఏమాత్రం ప్రయోజనంలేదు.
పోయినవాళ్ళకోసం ఏడ్చిలాభంలేదు. ఉన్నవాళ్ళనేచూచు
కొని సంతోషించాలె" అని ఇల్లాగే ఏమేమో చెప్పింది
గాద్గదికస్వరంతో. ఆతియ్యని మాటలు నాకు కొంచెం మన
శ్శాంతినిచ్చినవి. అప్పుడేనా మనస్సులోని కోరికను ఆమెతో
చెప్పివేయాలని బుద్ధిపుట్టిందికాని, ధైర్యం లేకపోయింది.

మర్నాడు ప్రొద్దున్న కాఫీ ఇత్యాదులు పూర్తియైన పిదపఆమెతో నేనుసంభాషించాను. నాదీనస్థితినిగూర్చి ఆమెకు ఎఱుకపఱచాను. ఈయింట్లో ఉండి నాపిల్లలను దయతో చూస్తూ నాభార్యఖాళీచేసిపోయిన స్థానంలో ఆమెను ఉండమనికోరాను. ఆవిడ నామాటలు ఎంతో వినయ భావంతో విని లజ్జాసహిత సర్వాంగయై, మౌనమూర్తియై, ఊరుకొన్నది. ఆమౌనాన్ని నేను అర్థంచేసుకోవలసిందే కాని నా ఆవేదన నన్ను ప్రేరేపించి, మళ్ళీ ఆప్రశ్నలనే నాచేత పలికించింది. ఆవిడవంచినతలఎత్తకుండా, నిమీలిత నేత్రాలతో అధోముఖయైయుండి ఒక్కసారిమాత్రం కళ్ళెత్తి చూసింది ఆచూపులు ఆమెహృదయవేదనను అంతా నాకెఱుకపరచినయి. అప్పుడు, ఒక విషాదాంత నాటకాన్ని చదివినపుడు కలిగే మనఃక్లేశాన్నే నేను అనుభవించాను. అప్పటికీ నేను ఊరుకోలేదు. "నాస్థితిఅంతా మీకు తెలుసు. ఇది తల్లిలేని పిల్లలుగల ఇల్లు.పిల్లలను పెంచగలస్త్రీకి ఇచ్చట స్థానముంది. ఆబిడ్డలపై ప్రేమ జూపిన యువతి నాప్రేమకు పాత్రురాలు అవుతుంది. ఇంతఎందుకూ, మీరు ఆస్థానాన్ని ఆక్రమించటానికి అంగీకరిస్తారేమోనని ఆశ పడుతున్నాను. గతించిన మీజీవితాన్ని గురించి నేను ప్రశ్నించను" అన్నాను. ఆమె తలవంచుకొనే "నేను పతితను. నేనెట్లా అర్హురాలను?" గాద్గదికస్వరంతో, కన్నీరు ఆమెకళ్ళల్లో తొణికిసలాడింది. "మీరుఇకముందువైవాహికజీవితానికిబద్ధులైనసద్గృహిణీత్వా

న్నినిర్వహిస్తామంటే అనుభూత పతితజీవితాన్ని మరచిపోవ టానికి అభ్యంతరంలేదు" అన్నాను నేను. "కాని"... అన్నది ఆవిడ ఏదో చెప్పబోయి చెప్పలేక ఆగినట్లు... "ఏమిటి?"అన్నాను నేను. "కాని నాకు గలుగబోయే బిడ్డ మిమ్ములను, నాపూర్వపుజీవితాన్ని మరచిపోనియ్యదు" అని పూర్తిచేసింది. ఆవాక్యం నిస్పృహతో జాలిగాచూస్తూ.

నేనూ ఏమీ అనలేకపోయినాను. కొంచెంసేపు మాఇద్దరి మధ్య మౌనం నిలిచింది. నా సమాధానంకోసం ఆమె శ్రవణ శక్తులు తహతహలాడినవి. చాలాసేపు నేను మాట్లాడలేదు. సాంఘిక తిరస్కారానికి గురి కావటానికి వితంతువివాహమేచాలు. ఆవిడపూర్వపుజీవితాన్ని మరపు రానీక, జీవితాంతంవరకునాకెదుటఆమె అవినీతికిసాక్ష్యంగా నిలబడే ఆబిడ్డనుకూడా నేనెక్కడ స్వీకరించేది!! నే నేమీ మాటాడలేక వూరుకున్నాను. చివరకు "మీదయ" అని ఒక్కమాట అని వెళ్ళిపోయినాను.

## ఆమె

మాస్టరుగారి మాటలు విన్నప్పటినుండీ ఈ రెండు రోజులలో నామనస్సులో గుద్దులాట బయలుదేరింది. నేను పతితనైనా ఆయన స్వీకరిస్తానన్నారు. కాని నాబిడ్డను ఏంజేయను? నన్ను బెజవాడపంపటానికి నిశ్చయించారుకదా. అక్కడేఇట్టిబిడ్డలను పెంచేఏర్పాటుఉండిఉంటుంది. అల్లాగ చేసిఈపిల్లలనుజూస్తూ ఈయనసాంగత్యంతో నేను గృహిణినై

పోయేదా? ఇంతకంటే ఎక్కువఆదరణ నాకు ఎచట దొరుకు తుంది! కాని —నాబిడ్డను వదలివేయాలిసిందే! అని ఈలాగ పరిపరివిధాల ఆలోచనలు పోయినై. నాతల దిమ్మెక్కి-పోయింది. కొద్దిగానిద్రపట్టింది. ఎంతసేపు నిద్రపోయినానో తెలియదు. నేను-నిద్రలేచేసరికి మాస్టరుగారు నామంచానికి దగ్గరగానిలబడి ఆదుర్దాగా చూస్తున్నారు. మెలకువవచ్చింది కాని నాఒళ్ళంతా నొప్పులుగా ఉన్నాయి. లేవలేనంత బలహీనంగాఉన్నాను. ఆయనఎందుకుఅల్లాగ అంతఆదుర్దాగా చూస్తున్నారో మొదటనాకు తెలియలేదు. నేలేవబోయినాను. కాని ఆయనపడుకోమనిచెప్పి "ఎందుకు అల్లాగ మూల్గారు" అన్నారు. "నాకు తెలియదండీ, అల్లాగనా" అన్నాను. నాకు బాగా జ్వరంవచ్చినట్లు నేనప్పుడు గ్రహించాను. జ్వరం వచ్చిందండీ అన్నాను. ఆయన "నేనూ అల్లాగే ఊహించి ఆదుర్దా పడుతున్నాను, "అని అంటూ నాచెయ్యిపైన వారి అరచెయ్యి వేసి, తాకి, పెదవివిరిచి డాక్టరుగారిని తీసుకొని వస్తాననిచెప్పి వెంటనేవెళ్ళారు. డాక్టరుగారు తరువాత ఒక గంటకువచ్చి నన్ను పరీక్షించి "జ్వరంఏమీ తీవ్రంగాలేదు. కదలకుండా పడుకోనీయండి— రేపటికల్లా ఆరోగ్యం కలుగు తుంది. ఇవ్వాళ పాలు, పండూ తప్ప మరేమి ఇయ్యవద్దు" అన్నారు. నేను అవిపుచ్చుకొన్నాను. "ఏమిరా భగవంతుడా ఇదొక కొత్తకష్టం తెచ్చిపెట్టావాతండ్రీ!" అని విచారించాను.

మధ్యాహ్నానికి జ్వరంతీవ్రత బాగా హెచ్చింది. మాష్టరు గారునామంచాన్నికనిపెట్టుకొనేఉన్నారు. దాసీది నాప్రక్కనే ఉంది. పిల్లలుమాత్రం అప్పుడప్పుడు వచ్చి దూరంగా నుంచుని ఆబిక్క మొఖాలతో చూచి పోతుండేవాళ్ళు. నాకు జ్వర తాపంవల్ల కలుగుతున్న బాధకంటె, ఈసత్పురుషులకందరికీ శ్రమఇస్తున్నానే అని ఎక్కువ కష్టంవేసింది. ఆరోజుపగలంతా నాకు ఎక్కువగా జ్వరంవచ్చింది. రాత్రికి నూటనాలుగుడిగ్రీల జ్వరంవచ్చిందట. మధ్యమధ్య నేను కళ్ళుమూసినిద్రపోతున్నా నాకుస్మృతితప్పలేదు. కాని మాష్టరుగారు ఎప్పుడూ నాగది వదలి వెళ్ళలేదు. ఆయన భోజనానికైనా వెళ్ళారో లేదో పాపము. నాకు ఆవిషయిం అడగాలని తోచిందికాదు. పిల్లలు అన్నాలు తిన్నారా అని మాత్రం అడిగాను. పాపము ఆ తల్లి లేని పిల్లలు బిక్క మొఖాలతో నాచుట్టూ చేరిఉండటంచూస్తే నాగుండె తరుక్కు పోయింది. హోటలునుంచి అన్నం తెప్పిస్తే పిల్లలు తిన్నారనేసరికి నాకు మరీ జాలేసింది. గంట గంటకూ మందు ఇస్తూ ఆయన పాపం నామంచం చుట్టూ తిరగటాన్ని చూచీ, ఆయన జాలిగుండెను జూచీ, నామనస్సు కలిగి పోయింది. రెండోరోజున కూడా జ్వరం తగ్గలేదు. నాబాధ జూచి ఆయన మరీ తల్లడిల్లి పోయినాడు. ఆయనదిఎంతదయగల హృదయమో నాకు బాగాబోధపడ్డది! ఆయన ఎప్పుడూ నా ప్రక్కనేఉండేవాడు. నేను కలవరిస్తే ఎంతో దయతో నా ముఖము పై కివంగి నన్ను తట్టిలేపి, ఏమిటండీ! అనిఅడిగేవాడు. నేనుమూల్గితే ఆయన ఆవేదన పడేవాడు. పాలు ఆయన

స్వయంగా నాకు చిన్నగ్లాసుతో ఇచ్చి తాగించేవాడు. పండ్ల రసాన్ని, బ్రతిమిలాడి, పుచ్చుకోమనేవాడు. ఆయన నిజంగా కరుణార్ద్రి హృదయుడు.

మూడవనాటి సాయంకాలానికి జ్వరంకొద్దిగా తగ్గింది. ఆమూడురోజులు ఆయనకు పాపం నిద్రహారాలు లేవని నేను గ్రహించాను. ఆరోజు రాత్రి నాకు నిద్రపట్టింది. అర్థ రాత్రివేళ మెలకువ వచ్చింది. కళ్ళు విప్పి చూసేసరికి నాకె దురుగా చాపపై ఆయన కూర్చుని ఏదో వ్రాసుకొంటు న్నారు. ప్రక్కన పిల్లలు నిద్రపోతున్నారు. ఈదిక్కుమాలిన స్త్రీఎడల ఇంత ఆదరణ చూపిన ఈపెద్దమనిషి ఋణం నే నెట్లా తీర్చుకొనేదా! అడవిలో నన్ను మానాన్న వొదిలేస్తే పాపం, ఈయన తీసుకొని వచ్చి ఇంత ఆదరణతో ఏలోపం లేకుండా చూస్తున్నారు. ఈయనకు ప్రత్యుపకారం ఏమి చెయ్యగలను, అని కొంతసేపు విచారించి ఎంత త్యాగమైనా సరే చేసి ఈయనకు భార్యను అవుదామని నిశ్చయించు కొన్నాను.

ఇంతలో ఎవరో ఒక స్త్రీవచ్చినాప్రక్కలోకూర్చుంది. ధౌతవస్త్రధారిణి. విగతకేశబంధ. చక్కని శరీరచ్ఛాయ గలది. పొట్టిది. విషాదచ్ఛాయా ముద్రితవదన అట్టి స్త్రీ వచ్చి నాప్రక్కలో కూర్చుని రెప్పలార్పక నాముఖాన్ని చూస్తూ న్నది. ఆఇంట్లో నేనుతప్ప ఇంకో ఆడపురుగులేదని నాకు తెలుసు. అందుకని ఈమె ఎవరా అని నాకు ఆశ్చర్యం వేసింది. కాని ఆమె ఎంతో జాలిగా విచారంగా ఆదరణతో నావంక చూస్తూన్నదని నేను గ్రహించాను. ఆమె కొంతసేపు

అనిమేష నేత్రమైచూచి, తరువాత నా చెక్కిళ్ళు నొక్కి కణ
తలు దువ్వినాతో ఏమో చెప్పింది. ఆమాటలు నాకు తెలిసి
నవి. కాని ఆమాటలువినటంవల్ల నేను తెలుసుకోలేదు. శ్రవణ
శక్తితో అవసరం లేకుండా, ఎల్లాగో, ఏమో, నాకు తెలి
యదు. కాని నేను ఆమెమాటలను గ్రహించాను. శబ్దాన్ని
శ్రవణేంద్రియం, మనస్సుకు ట్రాన్స్‌మిట్ చేస్తుందనిగదా
అంటారు. మామూలు జీవితంలో, శబ్దం మనస్సుకు తెలిపే
మార్గంఅదే. కాని ఆజ్వరంలో నేను ఆవ్యక్తి మాట్లాడిన
మాటలను శ్రవణేంద్రియం సహాయము లేకుండా గ్రహించాను.
ఆవ్యక్తిపెదవులువిప్పి మాట్లాడినాశబ్దం రావటంలేదని కూడా
నేను ఆక్షణంలో ఊహించుకొన్నాను. కొంచెముసేపు ఆమె
మాట్లాడి మరొక్కసారి నాచెక్కిళ్ళు దువ్విముద్దెట్టుకొంది.
తరువాత లేచి ఎదురుగానున్న మాస్టరుగారి గదిలోకి
పోయింది. ఇదంతా జరుగుచున్నప్పుడు డాక్టరుగారు నాప్ర
క్కనే ఉన్నారు. మాష్టరుగారు గదిలోనుండి ఆమె తిరిగి
బైటికిరాలేదు. నేనున్న గదిలోనుంచి ఆగదిలోకీ ఒకటే
ద్వారము ఆమె ఆగదిలో ప్రవేశించి, ఎంతసేపటికీ బైటికు
రాకపోవటము నాకెంతో ఆశ్చర్యం కలిగించింది. ఇక్కడ
ఇద్దరుపురుషులు ఉన్నా, సిగ్గు, వదలి ఆమె ఎందుకు వచ్చిందీ,
నన్ను అంతఆదరణతో చెక్కిళ్ళు దువ్వి ఎందుకు ముద్దెట్టు
కొందీ అనిమరీ ఆశ్చర్యం కలిగింది. 'ఎవ్వరండీఇప్పుడు వచ్చిన
ఆమె' అన్నాను నేనుడాక్టరుగారితో. ఆయన "ఎవరువచ్చా
రమ్మా ఎవరూలేరే!" అన్నారు "ఇప్పుడే గదండి వచ్చి నా

పక్కలో కూర్చుని, నాతో మాట్లాడి, లేచి అగదిలోకి పోయిందే! ఎవరండీ ఆమె?'' అన్నాను.

మేష్టరుగారిముఖం పాలిపోయింది. కాని డాక్టరుగారు మటుకు నాముఖంమీద చెయ్యివేసి. ''ఆమెసంగతంతా తల్లీ ఆమె నాసోదరి నిన్ను చూడటానికని వచ్చింది'' అన్నారు. ఆమాటలు అంటూంటే ఆయనకంఠం కీచుపడింది. నేత్రాలలో బాష్పాలు బిలబిలలాడినై. తరువాతఆయన నాముఖంపైన చల్లని గుడ్డవేసి దానిపై ఏదో మందు పోశారు. ఆచల్లదనంవల్లనో ఏమో నాకుహాయిగా నిద్రపట్టింది. మరునాడుకూడా నాకు జ్వరం తగ్గలేదు.

## డాక్టరుగారు

బుధవారం సాయింత్రం ఆరుగంటలకు నామిత్రుడు నాడిస్పెన్సరీకి ఆదరా బాదరా వస్తున్నాడు. నేను దూరాన్నించే ఆయనరాక గమనిస్తున్నాను. తలమీద జుట్టుఅంతా చెదరిఉంది. చొక్కాకుగుండీలు ఊడిపోయినయి. ఉత్తరీయం జారిపోయింది. బట్టపిచ్చిగా కట్టుకొన్నాడు. గబ గబ నడుస్తూవస్తున్నాడు. సాధారణంగా అతడు తగుజాగ్రత్తగా వస్త్రధారణచేస్తాడు. మెల్లగానడుస్తాడు. ఆవిధంగా రావటానికి తగినంత కారణం లేనిదె, అల్లాగ జరగదు. అతని జీవితంలో ఒకటె రెండుసార్లు మాత్రమే అల్లాగ రావటం నేను చూశాను. ఆరెండుసార్లుకూడా అతడు నిజమైన ఆపదలో ఉన్నాడు. ఆరోజున ఏదోమనఃక్లేశము కలిగిందని నే

నప్పుడు ఊహించాను. ఇంట్లో జ్వరపడి ఉన్న ఆవిడను గురించే మావాడు ఆదుర్దాపడుతున్నాడని అనుకొని రావడంతోనే ఏమిటి సంగతి అన్నాను. ఆయన కొంచెం శాంతాన్నీ మనఃస్థిమితాన్నీ నటిస్తూ "ఆవిడకు జ్వరం ఎక్కువైనట్లుతోస్తుంది. ఏమో పిచ్చిమాటలు మాట్లాడుతున్నది." అన్నాడు. ఉడుకులాం నీళ్ళలో గుడ్డముక్క తడిపి ఆమె ముఖంపైన ఆరంగా ఆరంగా వేస్తుండండి నేను ఇప్పుడే వస్తాను" అన్నాను. "అల్లా కాదు డాక్టర్ జీ! మీరు వెంటనే రావాలె. ఆమె పిచ్చిమాటలు మాట్లాడుతున్నదని కాదు నాకుభయం. జ్వరతీవ్రతవల్ల అల్లాగ మాట్లాడితే మాట్లాడవచ్చూ, దానివల్ల ఆట్టే ప్రమాదమూ లేదూ, అసినాకు తెలుసుకొని మాట్లాడేమాటలూ, వాని అర్థమూ, నాకు విపరీతమైన భయాన్ని కలిగిస్తూ ఉన్నాయి" అని వణకుతున్న పెదవులతో చెప్పారు. నాకూ ఆశ్చర్యంకలిగి, "అయితేసరే వస్తున్నా" నని వెంటనే కారు స్టార్టుచేసి ఆయననుఎక్కించుకొని మూడు నిమిషాలలో వాళ్ళఇంటికి చేరుకొన్నాను.

రోగినిపరీక్షించాను. జ్వరతీవ్రత హెచ్చుగానేఉంది. చాలా బలహీనంగాకూడాఉంది. గర్భిణీ స్త్రీకదా గర్భస్రావముకలుగుతుందేమోనని అనుమానం కలిగింది. ఆమె ఏమోగొణుగుతున్నది. ఆగొనుగుతున్నమాట ఏమో తెలుసు

కోవలెననినాకు బుద్ధిపుట్టలేదు. తీవ్రమైనజ్వరంలో డెలీరియం డెవలప్ చేసింది. చికిత్సఎల్లాగ నడుపుదామాఅన్న ఆలోచనలో ఉన్నాను. ఇంతలోనామిత్రుడు "చూశారా ఏమంటుందో ? వినలేదూ? అయ్యో! ఈతభా వినండి. మళ్ళీ అన్నప్పుడు" అన్నాడు. సరే చూద్దామని గమనిస్తూ కూర్చున్నాను. "ఎవరండీఆమె, ఇప్పుడొచ్చింది. ఎవరండీఆమె, నన్నెందుకు ముద్దెట్టుకొంది. ఆముద్దుఎంతహాయిగాఉంది. ఆగదిలోవుంది ఆమె రమ్మనండీఇల్లాగ"అంటూవుంది. ఎవరోస్త్రీఆమెకళ్ళకు కనబడుతున్నట్లు నేను గ్రహించాను. ఇదంతా డెలీరియం లక్షణాలని తెలుసు కాబట్టి జ్వరాన్నితగ్గించటానికి ఇంజెక్షను ఇస్తూమంచుగడ్డతలపైఉంచమనీ గంటగంటకూ చన్నీళ్ళతో ఒళ్ళుతుడువమనీచెప్పి వెళ్లినాను. రాత్రిమళ్ళీ నాస్నేహితుడు నాకోసంవచ్చాడు. మళ్ళీవెళ్ళిచూశాను. ఆరాత్రి నేనక్కడే ఉన్నాను.ఆమెఒక ఉద్ధోరణిలోఅంటూంది. పొట్టిమనిషి తెల్ల బట్టలుకట్టుకొనివచ్చి ఆమెముందు మాటిమాటికి కనపడుతూ ఉన్నదనీ, ఏమోమాట్లాడుతూవున్నదనీ, ఇల్లాగ పలవరిస్తూ వుంది.నామందు లేమీపనిచేయటం లేదు.జ్వరంతాత్కాలికంగా అప్పుడప్పుడు తగ్గి,ఆమెకుబాగా తెలివి వస్తున్నది. అప్పుడు ఆమెసంగతేచెపుతుంది. కానిజ్వరము మధ్యమధ్య హెచ్చటం పోలేదు. నాకుఆదుర్దాఎక్కువైంది. ఎవరో దిక్కులేనిస్త్రీని కాపాడి ఆదరిద్దామని, నేనుప్రయత్నంచేస్తే చివరకు ఇల్లాగ పరిణమించిందేమిరా ప్రభూ! అని విచారంకలిగింది. ఇక నామందులు పనిచేయవనే భయంకూడా కలిగింది,

మూడవదినం శుక్రవారం. ఆరోజు ప్రక్కయింటిలో ఉన్నముసలమ్మగారువచ్చి ఈస్థితి అంతాచూచి జాలిపడ్డది. ఆమెకు శుక్రవారంప్రొద్దున జ్వరంతగ్గింది. మామూలుగానే. కాని సాయింత్రం మళ్ళామామూలుగానే హెచ్చి సంధి పడుతుందని మాకు తెలుసును. ఆమెకు జ్వరంతగ్గి తెలివిగా ఉన్నప్పుడు ఈముసలిముత్తయిదువ వచ్చికూర్చుని ఇవ్వాళ మీారేంమందు ఇవ్వబోకండి అన్నది. నామందులోవిశ్వాసం నాకదివరకే పోవటంవల్ల నేను సరే నన్నాను.

## ముసలి ముత్తైదువ

నాకునాలుగురోజులక్రితమే తెలిసింది పాపము ఈపిల్లకు జబ్బుగావుంది ఆమటాఅని. ఏదో రెండు రోజులలో తగ్గుతుంది అనుకున్నానుగాని ఇంతప్రమాదస్థితిలోకివస్తుందని నేననుకో లేదు. నిన్నరాత్రిగామాలు మాముసలాయన చెప్పారు ఈ కథంతా.ఆడదిక్కులేని మాష్టరుగారికి ఆమెదిక్కు అవుతుందే మోనని ఆశపడ్డాను. ఇవ్వాళప్రొద్దున వచ్చి చూద్దునుగదా పాపం ఆపిల్ల చాలా ఆపదలోఉంది. ముత్తయిదువ వచ్చి కళ్ళకు కనపడుతూంటే ఈ తెలివితక్కువవాళ్ళు ఆమెకు సీసా మందు నీళ్ళు ఎన్నిపోస్తేమట్టుకు ఏమిలాభం? ఈ ఇంగ్లీషులు చదువుకొన్నవాళ్లకు ఏంతెలుస్తాయి మనఆచారాలూనూమన సంగతులూనూ!నీళ్ళోసుకున్న ఆబిడ్డకు ఇల్లాంటి స్థితివచ్చిందని

వినేసరికి నామనస్సు నీరైపోయింది. చెప్పొద్దు. ఏదో అందరం ఆడపిల్లలు గలవాళ్ళమే! అందులో ఆమె కథ వినే సరికి కడుపు తరుక్కుపోయింది. ఆతండ్రి ముండాకొడుక్కి ఎల్లా చేతులొచ్చినయ్యో పండంటి బిడ్డను పరభూములలో వదిలేసి వెళ్ళటానికి! ఏదో ఉప్పూ కారం తినేశరీరం కాబట్టి ఊరుకోబట్టలేక గడ్డితిన్నదే అనుకో. అయితేమటుకు కన్న కడుపు కాదటమ్మా ఆతండ్రికి? స్వయంగా తీసుకొని వెళ్ళి, సీతమ్మవారిని అడవులలో వదిలేసినట్లు, దిక్కులేని చోట వదిలేసి వెళ్ళిపోతాడూ? నిజంగా, చెపితే నమ్ముతావో నమ్మవోకాని నాకడుపు తరుక్కుపోతుంది ఆకథ అంతా విని. నాదీ కన్నకడుపే.

ఆపళంగా ఆశుక్రవారం ప్రొద్దున్నే లేచి వెళ్ళి చూశాను ఆ అమ్మాయిని. పాపం నెలలొచ్చినయి. కాని కడుపేమన్నా ఇల్లాగ పైకి కనబడుతుందనుకొన్నావా! ఎబ్బే! పొన్నకాయలాగ చక్కగా ఇంతకడుపూ, తెల్లటిచెక్కిళ్ళూ, కోటేరుబోసినట్లు ముక్కూ, పొట్లకాయలలాగ చేతులూ, చెంపకు చేరడేసి కండ్లూ, అదీ, అంచక్కగా ఉంది ఆబిడ్డ. వంటిమీద చెయ్యేసి చూస్తే అప్పటికేమీ జ్వరం లేదు. సాయంత్రానికల్లా పుట్టెడు జ్వరంవస్తుందనీ, ఎక్కడలేని పలవరింతలు వస్తాయనీ చెప్పారు.

పాపం, ఆఅమ్మాయి, నన్ను చూచి కళ్ళనీళ్లు గుక్కుకొని, "శామ్మగారూ! జ్వరం ఎక్కువగా వస్తూన్నదండీ ఎవరో ముత్తయిదువ కనబడుతున్నదండి. ఆవిడ ఏమిటో.

చెపుతుంది సాద నాకప్పటికి అర్థమైనట్టె ఉంటుందికాని, మళ్లీ తెలివివచ్చినతరువాత, ఆమె చెప్పిన సంగతులు ఒక్కటి జ్ఞాపకానికి రావు. ఏమిటో అయోమయంగా ఉందండీ. ఇప్పటికి మూడు రాత్రిళ్ళనుంచి కనపడి కళ్ళనీళ్లు పెట్టుకొని పోతున్నది. ఆముత్తయిదువ ఎవరో, ఏంజెయ్యాలో చెప్పండి బామ్మగారూ'' అని ఆఅమ్మాయి నావంక దీనంగా చూస్తూ అడిగింది. ''ఎట్లా ఉందమ్మా ఆభాగ్యశాలిని'' అన్నాను. ''చక్కగా కనుపడు తుందండీ. పొట్టిమనిషి. తెల్లటి ముఖం చిక్కన చెక్కిళ్ళు. పెదవి దొండపండులాగ ఎర్రగా వుంది. తెల్లటి చీరగట్టుకొని, తలంటిపోసుకుని వేలుముడి వేసుకున్న జుట్టులో మందార పువ్వులు తురుముకొని, అంచకొక్క నడుస్తూవచ్చి నాప్రక్కలో కూర్చుని నాచెక్కిళ్ళు నొక్కు తుంది. నన్ను ముద్దెట్టుకొంటుంది. ఏమిటో చెపుతుంది.'' అని పూసగుచ్చినట్టు అంతా చెప్పుకొచ్చింది.

నాకప్పుడే అర్థమైంది. అయినా తేల్చుకొందామని మాష్టరుగార్ని అడిగాను. ఏమండీ మీభార్య పొట్టిమనిషా అని. ఆయన అవునన్నాడు. ఆమెకు మందారపూవులంటే ఇష్టమా అన్నాను. చాలాఇష్టమండీ ఎప్పుడూ ఆపూలే పెట్టు కుంటూ ఉండేది అన్నారు. సరే ఇంకేం! నామనస్సుకు అంతా తెలిసిపోయింది. డాక్టరుగారితో ఆపూట మందేమీ ఇయ్యవద్దని చెప్పి. ''అమ్మాయీ నీవేమీ బెంగపెట్టుకోకు ఇవ్వాళనీకు జ్వరంరాదు. నేజేస్తాగా, ఇప్పుడే మళ్ళీ వస్తాను''

అని చెప్పి ఇంటికెళ్ళాను. చప్పున రెండు కుంకుడు కాయలు కొట్టుకొని తలంటిపోసుకొని, తులిసెమ్మకుపూజచేసి, ఆ మడి బట్టలతోటే ఆ అమ్మాయిదగ్గరకు వచ్చేశాను. మాష్టరుగారిని పిలచి, "ఏమండీ, ఈ మెకు కనపడుతున్నది మీభార్య. ఆమె ఫొటోఉంటే ఇల్లా ఇవ్వండి. అది ముందుపెట్టుకొని పావుగంట సేపు ధ్యానంచేస్తినా ఆమె ఎందుకు కనబడుతున్నదో, ఆవిడ ఉద్దేశ్యమేమిటో అంతా నాకు తెలుస్తుంది. నాకు అలాంటి శక్తివుంది" అన్నాను. ఆయన ఫొటో ఇచ్చాడు. పావుగంట సేపూ నిశ్చలంగా ధ్యానించాను. అంతా తెలుసుకొన్నాను. ఆమెహృదయాంతర్గత వాంఛ నామనస్సుకు విదితమైనది.

తనపిల్లలకు ఇంతవండిపెట్టి దయగాచూసేవాళ్ళు లేరనీ పాపం ఆఇల్లాలుతల్లడిల్లిపోతూంది. అని అంటూ ఆఅమ్మాయి పక్కదగ్గరకు వెళ్ళి ఆ స్వర్గీయ స్త్రీ మనోరథ మేమిటో చెప్పాను. తరువాత ఆఅమ్మాయికూడా దణ్ణంపెట్టుకుంది.

అంతే ఆరోజునుంచీ ఆమెకళ్ళకుఆఇల్లాలు కనబడలేదు మర్నాటినుంచీ జ్వరంక్రమేపీతగ్గుకుంటూవచ్చి పదిపదిహేను రోజులకల్లా ఎప్పటి మనిషి అయింది.

ఏమిటో,ఆడవాళ్ళజబ్బులు ఈడాక్టర్లకుఏం తెలుస్తాయి. అయిందానికి, కానిదానికీ ఇన్నిసీసాసీళ్ళు పొయ్యటం తెలుసు వాళ్ళకు.అదీకాకపోతే సూదిమందెక్కిస్తారు. సద్యః ఇంకా నయం–సూదిమందిచ్చారుగారు ఆబిడ్డకు!! ఆచెంబెడు నీళ్ళూ నేనేపోస్తాను. ఇక్కడేఉండిపో అమ్మాఅన్నాను. "బామ్మ

గారూ నేనూ దిక్కులేనిదాన్ని మీవంటివాళ్ళేదిక్కు'' ఆమాట అని ఆపిల్ల కళ్ళనీళ్ళెట్టుకొంటే, నాకడుపు తరుక్కుపోయింది.

## ఆమె

నేనున్న ఇల్లు ఒకచక్కనితోటలోవుంది. డాక్టరుఅమ్మగారుదయార్ద్రహృదయురాలు. నావంటిఅభాగ్యజీవులుఅక్కడ ఇంకా ఇద్దరున్నారు. మాకు అన్ని సదుపాయాలు చేశారు వారు. క్రైస్తవులైనా హిందువులయందు ఎంతదయవాళ్ళకు! అక్కడ భోజనానికిఇష్టంలేకపోతే మనంవేరేఏర్పాటు చేసుకోవాలె. నాదగ్గరఅప్పుడు డబ్బుఎక్కడిది? మాష్టరుగారూ డాక్టరుగారూ నన్నిక్కడకి పంపివేశారేగాని ఇక్కడఏర్పాట్ల విషయమైవారికి తెలియదు. వాళ్ళఅన్నంతినటంనాకిష్టంలేదు. హోటలునుంచితెప్పించుకొని తింటానికి డబ్బూలేదు. వెంటనే మాష్టరుగారికివ్రాస్తే వారుతప్పక నాకుకావలసిన ధనసహాయ్యం చేసేవారే. కాని వారుచూపిన ఆదరణకు నేను ఇదివరకే వారికిఋణపడివున్నాను. ఇంకాఎక్కువగా వారిసాయం అపేక్షించటానికి నాకుమనస్కరించలేదు. వాళ్ళఅన్నంతినటం ససేమిరా నాకు ఇష్టంలేదు. నామెళ్ళో నాలుగు నవరసులు గొలుసూ చేతికిఒకజత గాజులూఉన్నవి. ఇందులోఏదిఅమ్ముదామా అనిచాలాసేపు విచారించాను. చివరకు మెళ్ళో బొత్తిగాఏమీలేకపోతే బాగుండదనిచేతులనున్న జతగాజులూ అమ్మగారికిచ్చి అమ్మించాను. యాభైఎనిమిదిరూపాయల పై

చిల్లరవచ్చింది: ఒక పాతిక రూపాయలు హోటలు ఖర్చు క్రిందకావాలనుకున్నాను. మహా ఉంటే రెండు నెలలకంటే ఎక్కువఉండనక్కరలేదుగా అనుకున్నాను. వెధవ తెలివి తక్కువతనం, దానితరువాత ఎక్కడికిపోవాలి? ఆమాష్టరు గారువచ్చినన్ను తీసుకెళ్ళి వివాహంచేసుకుంటారనే కామాలు నాఊహ. నాకు పుట్టే బిడ్డతో నన్ను స్వీకరించననే కదా వారు చెప్పింది! నేనుఅప్పటికీ ఇప్పటికీ బిడ్డను వదలివేయటానికి ఇష్టపడనూలేదు. ఆపుట్టినబిడ్డకు స్తన్యపానం చేయించాలని నాకు ఊహకలిగినప్పుడల్లా నావొళ్ళు పులకరించి నారొమ్ములు గగుర్పాటుపొందేవి. నాబిడ్డను ముద్దాడాలనీ, ఎత్తుకొని తిరగాలనీ, ఊహ తియ్యని తలంపులతో నాతలదిమ్మెక్కేది; నాబిడ్డచెక్కిళ్లు ముద్దాడుతున్నట్లూ ఆబిడ్డముద్దుమాటలు మాట్లాడుతున్నట్లూ,తప్పటడుగులు వేస్తున్నట్లూ కలలుగనేదాన్ని. నేను ఇల్లాఉబలాటపడ్డప్పుడల్లానాగర్భంలో ఉన్నబిడ్డకు......గదలిక గలిగేది. నాలోవున్న స్త్రీత్వం మాతృత్వం పాలపొంగులాగ పొంగుతూ ఉండేవి.

కాని ఆబిడ్డను పెట్టుకొని నేనెక్కడ ఉండేది? ఈవిశాల ప్రపంచంలో నాకుతావెక్కడవుంది? ఎల్లా జీవించటం? వంటలక్కనో అయి దారిద్ర్యదేవత ఒడిలోజీవితం గడపాలె. అదీ అంతసులభసాధ్యంకాదు. నాఅవినీతి బయల్పడక మానదు. పాపం బద్దలుకాకమానదు. అప్పుడు నేను సంఘు తిరస్కారానికీ బహిష్కరణకూ గురిఐౌ, తింటానికి తిండి, కట్టు

కంటానికి గుడ్డాలేక అల్లాడవలసి వస్తుంది. బిడ్డను వదిలి వేయటానికి ఈఅమ్మగారి ఆసుపత్రిలో ఏర్పాటు ఉంది. కాని అమ్మో! నా బిడ్డను నేను వదలివుండటమే!—అని ఇల్లాగ పిచ్చి పిచ్చి ఊహాలన్నీ నాతలలో తిరుగు తుండేవి.

ఇంతకూ ఆరోజు సంగతి ఏమిటంటే పాతికరూపా యలు మాత్రం హోటలు ఖర్చుక్రింద ఉంచుకొని మిగిలిన సొమ్ముపెట్టి నాలుగుచీరలూ, ఒకడజనుజాకెట్లూ, తెప్పించు కొన్నాను. వీటికన్నిటికీ పోను ఇంకాకొంతపైకం మిగిలింది అదంతా డాక్టరుఅమ్మగారిదగ్గరే ఉంది. సొమ్ములంతా ఆ మెకే ఇచ్చాను. ఆమె నాకు కావలసినవన్నీ తెప్పిస్తూ మిగి లితే లెక్క జెప్పి ఇస్తానన్నది.

ప్రతిరోజూ డాక్టరు అమ్మగారు ఒక్కసారి మమ్మ లను చూచిపోతూఉండేది. ఆమెనుచూచినా ఆవిడమాటలు విన్నానాకు పరమానందంగా ఉండేది. దిక్కులేని ఈక్షుద్ర జీవినికనికరించటానికివచ్చి, ఇష్టదేవతాదర్శనము ఆమెప్రసన్న రూపము. ఆమెదయగల వాక్కులు విన్నప్పుడు నాహృద యం కృతజ్ఞతతో స్పందించేది. నావంటి నిత్యదుఃఖితలైన నిర్భాగ్యురాండ్ర నెందరినో ఆమెరక్షించింది అని అనుకొను నప్పుడెల్లా కృతజ్ఞతావాహిని, నాకుమ్మహృదయంలో చం ద్రదర్శనమున పొంగు సముద్రమువలె పొంగిపోయేది. ఆమె వాక్కు మధురిమచిక్కేది. తేనెలూనేది. ఆమె వాక్కు "తీక్ష్ణభానుమహోజ్జ్వల దీప్తివడలి కటికదాహాన తపియించి కనలువేళ వినంబడు, తేట నెలయేటి తరగలపాట" ఆమె

ప్రేమస్వరూపిణి. దిక్కులేక, ఆర్తులై, అల్లాడే ఎందరి దరి ద్రముల దుఃఖభారాన్ని ఆమె వహిస్తున్నదో, ఎందరి నిర్భాగ్యుల నిట్టూర్పు ఆమె చేలాంచలాల నిద్రిస్తున్నవో! అహో ఆమె దేవి. ఆమె మృదుమధురవాక్కులు వినటానికి నేను తహతహలాడేదాన్ని. ఆమెకటాక్ష కిరణాంకురానికిమహో దధిలాగ నాహృదయం ఉప్పొంగి పోయింది.

మాముగ్గురులో నేనొక్క తెనే కాస్తో కూస్తోచదువుకొన్నదాన్ని. మిగిలిన ఇద్దరూ నిరక్షరకుక్షులు. నర్సులలో ఒక్కర్తె భోజనానంతరం వచ్చి మాకు బైబిలులోని మంచి సంగతలు చెప్పేది. నేను ఇరికా అక్కడికి వెళ్ళనపుడు ఆమె బైబిలు చెపుతూఉంటే, ఆఇద్దరు సరిగ్గా వినేవాళ్ళే కాదట!! విన్నాగ్రహించేవాళ్ళు కాదడ! ఒకవేళ గ్రహించినా, శబ్దార్థంమాత్రమే కాని ప్రేమమూర్తి, దయామయుడైన, ఆ క్రీస్తు ప్రేమతత్వము వాళ్ళమనస్సుకు ఎక్కేదేకాదట. ఆ దేవుని వాక్యములు నేను చక్కగా అర్థంచేసుకొనేదాన్ని; ఎంతో ఉత్సాహంతో, నేను ఆవాక్యాలు వింటూ చక్కగా అర్థంచేసుకుంటూ ఉంటే అమె ఎంతో సంతోషించేది. ఒక రోజుకంటే మరొకరోజు నాకు ఉత్సాహం ఎక్కువైంది. క్రీస్తుప్రభువుయొక్క బోధనలన్నీ సమగ్రంగాచదివి అర్థంజేసుకొన్నాను. ఆవిషయాలు నాఅనుభవంలోకి తెచ్చుకొన్నాను. నాజీవితంలో తృప్తీ, ఆనందమూ కలిగినాయి. ఆకరుణామూర్తి, ఆదాయసింధువు, నాహృదయం ప్రవేశించాడు,

మనః చక్షువులతో ఆయనను దర్శించి నేను పవిత్రురాల నైనాను. దరిద్రులయొక్కయూ, పాపుల యొక్కయూ దుఃఖభారాన్ని భరించటానికి ఆత్మార్పణంచేసిన ఆమహా నీయుని చరిత్ర చదివి చదివి ఆనందించాను. పాపపంకంలో పడిన నాబోటి క్షుద్రజీవుల ఆర్తరావాలు విని రక్షించ గలది ఆయనఒక్కడే అని నేను విశ్వసించాను. ఆ ప్రేమమూర్తికి ఆదివ్యజ్యోతికి, నాహృదయం అంకితం చేశాను. "వనులలో వనధునీధ్వనులలో, నాలోనిఅణువనువులో నీసుధాలాపన మె నేను. తనువు పులకలు దేరి, వినగోరి, నినె గోరి మిను మన్నులం దెల్లెడను వెదకు నాయెదకు దర్శనమీయవో, దయామయమూర్తీ" అని హృదయ పూర్వకంగా ప్రార్థన చేశాను.

బైబిలును నేను శ్రద్ధతో ఎప్పుడూ చదువుతూ ఉండ టమూ ఆవాక్యములలో విశ్వాసము, ప్రేమా చూపటమూ, గమనించింది అమ్మగారు. లోకంలోఉన్న ఒక్కపాపిని ఒక్క అభాగ్యను, దేవుని రాజ్యంలోకి తీసుకొని పోగలిగినాను, అని ఆమె ఎంతోసంతోషించింది. ఆరోజు మాకు "కొరిం థీయులకు" ఆరవ అధ్యాయము, ఆరవభాగము, పదమూడు మొదలు ఇరవయ్యోవాక్యమువరకూ బోధచేసింది.

"దేహము జారత్వము నిమిత్తముకాదు. ప్రభువు నిమిత్తమే ! ప్రభువు దేహమునిమిత్తమే ! మీదేహములు క్రీస్తుకు అవయవములు. జారత్వమునకు దూరముగా పారిపో వుడి. ప్రతిపాపము దేహమునకు వెలపటయున్నది. కాని

జారత్వము చేయువాడు తన స్వంతశరీరమునకు హానికరముగా పాపముచేయుచున్నాడు. మీ దేహము దేవునివలన మీకు అనుగ్రహింపబడి మీలోనున్న పరిశుద్ధాత్మకుఆలయమై యున్నదని మీ రెరుగరా? మీరు మీ సొత్తుగారు. నిలువబెట్టికొనబడినవారుగనుక మీ దేహములో దేవునిమహిమ పరచుడి.''

ఈవిషయాన్ని గురించి ఆమె ఆరోజుచక్కగామాట్లాడింది. అప్పుడు నాహృదయావేదన ఎట్టిదో నేనువర్ణించలేను. నేనేగదా అట్టిపాపిని. అట్టి ఘోరపాపం నుండి విముక్తురాలనగుటకు పశ్చాత్తాపమొక్కటే మార్గమని నాకు తెలిసింది. పాపమయమైననాహృదయాన్ని, తీవ్రమైనపశ్చాత్తాపాగ్నిలో శుభ్రపరిచాను. ఆదేవిమాట్లాడినప్రతిమాటా నామనస్సులో అచ్చుపడిపోయింది.ఆరోజుననే నేనుప్రభువునుకలసికొన్నాను. ఆ ప్రభువులో లీనమైనాను. ఈదేహాన్ని ఆ ఏసుప్రభువుకు నివాస గృహంగా అర్పించాను. నాకళ్ళవెంట నీరు కారింది. ''పశ్చాత్తాపాగ్నికి నానవనీత ముగ్ధహృదయంకరిగి నీరైంది. ఆఏసు ప్రభువు దర్శనం అయింది. ఆయన నాహృదయాధిదేవత అయినాడు. ఆమహామహుని కరస్పర్శవలన నా దేహం పవిత్రంఅయింది. నే నిపుడు ఆ ప్రభువుయొక్క దాసిని. తల్లీ ఇదీ నాఅనుభవం. ఈఅశ్రువులు ఆనంద బాష్పములు'' అని అమ్మతో నివేదించాను. అమ్మ ఎంత సంతోషించింది! ఆమె కూడ క్రీస్తుయొక్క పవిత్ర దేహమును పొందింది. నన్నుఆమె ప్రేమతో నిమిరి చెక్కిలిపై ముద్దుపెట్టి వెళ్ళిపోయింది.

ఆసుపత్రిలో ఉన్న రోగులకూ, నావలెనే కంటానికి వేచి యున్న చూలెంతలకు ఏసు ప్రభువువారి సువార్తను తెలియ జేయటానికి నన్నే నియోగించారు. నేను ఆపనినిసంతో షంతో నిర్వహించటం సాగించాను.

## ఆయన

దిక్కు లేనివారికి పురుడుపోయటానికి ఏర్పడ్డ ఆ ఘోషా ఆసుపత్రినుండి ఎవరో స్త్రీవచ్చి ఆమెనుతీసుకొని వెళ్ళినప్పటి నుండి నేనుతిరిగీ ఒంటరివాణ్ణిఅయిపోయినాను. పిల్లలూ నేనూ కూడా, పూటకూళ్ళ ఇంట్లోనేభోజనం చేస్తున్నాము. నేను తొమ్మిదింటికల్లా భోజనం చేసి ఆఫీసుకు వెళ్ళిపోయేవాడిని. ప్రొద్దున్న బడికెళ్ళినపిల్లలు పదింటికో. పదకొండింటికో, ఎప్పుడో వాళ్ళయిష్టంవచ్చినపుడు హోటలుకుపోయిఏదో, తినేవాళ్ళు. దాసీదివాళ్ళవెంట వెళ్ళేదికాని అది బయట కూర్చుని ఉంటే ఈపసివెధవలుఏంతినేవాళ్ళోఏమో! తల్లిదగ్గరకూర్చుని కథలు చెపుతూ, బ్రతిమాలితేనే, సగంతినీ సగంతినకా మిడికే పసి వెధవలు ఈపూటకూళ్ళ ఇంట్లో ఏంతినేవాళ్ళో! కిం దింతా పైనింతాపారేసి వెళ్ళిపోయేవాళ్ళు. అక్కడవంటకూడా మన ఇంట్లోమో స్తరుగాఉండేదికాదు. కూరా, పచ్చడి, పులుసూ చారూఅనిపేరుకుమాత్రం నాలుగూ, ఉండేవన్న మాటేగాని, ఒక్కటీ నోటికి రుచిగా ఉండేదికాదు. మాపిల్లలకు కంది పచ్చడి అంటే ఎంతో ఇష్టం. అప్పడం, వడియంతో సగం

అన్నం తింటారు. కాని ఈహోటలులో, ఇది కందిపచ్చడనీ, ఇది మినపప్పచ్చడనీ, ఇది వంకాయబజ్జీ అని వాడు చెపితే తెలియాలిసిందే కాని, లేకపోతే మానవమాత్రుడు తెలిసికోవటం కష్టం. ఆనూనెతో వేచితీసిన అప్పడం అధ్వాన్నంగా ఉండేది. ఇంత పసిపిల్లలు వంటపూటె ఇంటో తినటంజూచి పిల్లలుగల ప్రతి తండ్రి జాలి పొందేవాడు. నేను ప్రొద్దునవెళ్ళి సాయింత్రానికి వచ్చేవాడిని. ఈలోపున వాళ్ళసంగతి చూచేవాళ్ళే లేరు. ఆపనిచేసేమనిషి, వాళ్ళను పొద్దస్తమానం కని పెట్టి చూస్తున్న దని నమ్మకంఏమిటీ?

వీళ్ళను ఇంట్లోవదిలేసి, ఒక్కొక్కప్పుడు అది తన పనిమీద వెళ్ళిపోతూఉండేది. ఆసమయంలో వాళ్ళు కొట్టుకోటమో తిట్టుకోటమో, క్రిందబడి దెబ్బలు తినటమో జరుగుతూ ఉండేది. సాయంత్రం నేను ఇంటికి వచ్చేసరికి ఏ వెధవకో కాళ్ళు చెక్కులూడి ఉండటం సాధారణంగాజరుగుతుండేది. దాసీదాన్ని అడిగితే, నేనప్పుడే నాపిల్లలకు అన్నం తినిపించటానికి వెళ్ళానండి. ఇంతలోకే అబ్బాయిగారు క్రింద పడ్డారండీ. అని ఏదో వెధవ కుంటిసమాధానం చెబుతూఉండేది. మధ్యాహ్నంపూట, రెండుగంటలకు బడికిపోయేముందు వాళ్ళకు మజ్జిగన్నం తినడం అలవాటు. కానిహోటలులో ఎల్లా వీలగుతుందీ? అందుకనే రొట్టేపాలూ, ఏర్పాటుచేసాను. దాసీదివాళ్ళకు రొట్టెఇచ్చి పాలుతాగిస్తుంది. కాని వాళ్ళు నానాఅల్లరీ చేసే వాళ్ళు, రొట్టెతినేవాళ్ళు కాదు. ప్రొద్దున తిన్న అన్నంతోనే సాయిత్రందాకా ఉండి పీక్కుపోయిన

డొక్కలతో సాయింత్రంనాకు కనబడే వాళ్ళు. నాకడుపు తరుక్కు పోయేది ఆబిడ్డలనుజూచి. కొన్నాళ్ళు వంటమనిషిని పెట్టి ఇంట్లోవంట చేయించాను. పదిగంటలకు పిల్లలకు అన్నం పెట్టి, ఆవిడ వెళ్ళి పోయి, సాయంత్రం మళ్ళీ ఆరింటికివచ్చి వంటప్రారంభించేది. పిల్లలకు మధ్యాహ్నం భోజనం ప్రాబ్లం సాల్వ్ కాలేదు. ఆవంటమనిషి మధ్యమధ్య మానేసేది. ఆరోజు మళ్ళీ హోటలుకు ప్రయాణం. మధ్య మధ్య పనిమనిషి మూడురోజులు కంటికి కనబడేదే కాదు. మొన్న ఈమధ్యనే మూడురోజులు మానావు మళ్లీ అప్పుడే ఇదేమిటే అని నా గోల. గేదె పారిపోయిందనీ, ఆవు ఈనిందనీ అది మాటి మాటికీ మానుతుండేది. ఆరోజులలో పిల్లలకు నేనేస్వయంగా నీళ్ళుపోసుకొని కాఫీకాచి ఇచ్చేవాణ్ణి.

మాఇంటి ప్రక్కనున్న ముసలమ్మగారు అయ్యో ఆడ దిక్కులేనిసంసారం, ఎన్ని తిప్పలువచ్చినాయీ ఈపెద్దమనిషికి అని ఊహూవిచారపడుతూఉండేది. "నాయనా మొన్న వచ్చిన ఆవిడనునీఇంట్లో ఆదరించకపోయినావా, ఏదో కాస్త కాచి పోసే దిక్కు అయ్యేది" అనిపలకరించింది. ఆవిడకూ నాకూ జరిగిన సంభాషణా, ఆవిడను నేను స్వీకరిస్తాను గాని, ఆవిడకు పుట్టినబిడ్డను ఎవరికన్నా ఇచ్చివేయాలని నేను అంటే ఆమె అందుకు అంగీకారం కనపర్చక పోవటమూ, మొదలగు విష యాలన్నీ ఆమెకు చెప్పాను. ఆమెకూడా నాతో ఏకీభవించింది బిడ్డను తీసుకోవటం శ్రేయస్కరం కాదన్నది. "ఈ పిచ్చమ్మ

కాకపోతే ఇంకోఅచ్చమ్మవస్తుంది. ఎక్కడన్నా ప్రయత్నం చేయినాయినా నేనుకూడా ప్రయత్నంచేస్తానుండు'' అన్నది. నేను సరేనన్నానన్నమాటే కాని, నామనస్సు ఆస్త్రీమీాదే ఉన్నది. ఆమెదిక్కులేని స్థితిలో నున్నప్పుడు నేను ఆమెను ఎంతోఆదరించాను. ఆమెకు నాయందు తప్పకకృతజ్ఞత ఉంది. ఆకృతజ్ఞతే మాయిరువురమధ్య బంధము. ఆ మాత్రం బలమైన బంధముఒకటిముందు ఉంటే దానికి మనము ఎన్నో బందాలు పెనవేయవచ్చు. ఇట్లాకాక ఎవరోక్రొత్త మనిషిని తీసుకొనివస్తే ఏమో, పరిస్థితులు ఎల్లాగ పరిణమిస్తవో! దైవవశాత్తు ఈమెకూ, నాకూ, ఒక విచిత్రమైన సంబంధం ఏర్పడిఉన్నదామె. ఈమె నాపిల్లలను ఆదరించాలి. అదీగాక నాపిల్లలతల్లికూడాఆమెనే తన ప్రతినిధిగా అంగీకరించినట్లు స్పష్టమైంది. కాబట్టి ఆమెనేప్రోత్సహించి తీసికొనిరావలయునని నిశ్చయించికొన్నాను.

## ముసలి ముత్తైయిదువ

మాస్టరుగారికి అయిదుగురుపిల్లలు. పదేళ్ళనుంచినేను వారినెరుగుదును. మొన్నమొన్నటిదాక ఆయనతండ్రికూడా బ్రతికేవున్నాడు. ఆయనభార్య మహాయోగ్యురాలు. అయిదుగురుపిల్లలూ, ఆవిడా అత్తామామలతో కాపురం చేస్తుంటే చూడటానికిముచ్చటగాఉండేది. ఆమెఎప్పుడూ బట్టమాయనిచ్చేదికాదు. బంతిపువ్వులాగుండేది. దోసపాదులాంటిసంసారం

ఏపాపిష్టికన్ను పడ్డదో ఏఘోరశాపానికిగురి అయిందో కాని పండంటిసంసారం బద్దలయిపోయింది. చూస్తుండగానే పుష్య మాసంలో ఆపిల్లలతల్లి వెళ్ళిపోయింది. చెట్టమ్మ!! చెట్టంటి మనిషి గభీలునకూలిపోయింది. ఆదుఃఖంతో నేకుమిలిపోతున్న ఆపెద్దమనిషికి దానితరువాత సంవత్సరం తిరగకముందే, రపీ మని మరో దెబ్బతగిలింది. పెండ్లయిన పెద్దకూతురు తల్లిదగ్గరకు పోయింది. ఎడపెడా తగిలినాయమ్మా దెబ్బలు. పాపం ఏం జేస్తాడు? ఇంకోరైతే ఆత్మహత్య చేసుకొనేవారే. కానిఉన్న నలుగురిపిల్లలనూ పెంచి పెద్దవాళ్ళనుచెయ్యాలె! వాళ్ళభారం ఎవ్వరినెత్తినవేస్తే ఎవ్వరుభరిస్తారు? అదీకాక అయనకు నా అన్నవాళ్ళు లేరు. దిగులుపడిపోయి కృశించి చిక్కిసగమైనాడు.

నేనుమొదటనుంచీపోరుతునేఉన్నా. నాయినా ఎక్కడైనాకాస్త పెద్దపిల్లనుముడిపెట్టుకోమని. నామాటవినలేదు. ఆపిల్లలతో మగవాడు సతమతంఅవుతూ ఉండటమూనూ ఆ తల్లిలేని పిల్లల కష్టాలూనూ, చూస్తేనాకు కడుపులో దేవి నట్లుండేది.

ఈవిడఎవరో రావటమూ ఈయనఇంట్లో ఉండటమూ, అంతాచూస్తూనేఉన్నాను. మొదట ఏమిటో అనుకున్నాను. కాని ఆరోజుఆమెకుజ్వరం వచ్చినపుడు నేను చూడటానికి వెళ్ళినప్పటినుంచీ, ఆఅమ్మాయినన్ను బామ్మగారూ అని పిల వటం, నేనూఅప్పుడప్పుడు ఆయింటికి వెడుతూఉండటంజరిగి నయి. పాపం ఆవిడైనామహాయోగ్యురాలు. ఆతల్లిలేని పిల్లల

యందూ, ఆపిల్లలతో అవస్థపడు మాస్టరుగారియందూ, ఆమె ఎంతో జాలిపడ్డది. ఉన్నన్నాళ్ళూ, ఆమె ఆపిల్లలను ఎంతో ఆదరణగాచూస్తుంటే. నేనూసంతోషించాను. ఈమెఇక్కడే ఉండిపోయి ఆయనకుకాస్త ఆధారం అవుతుందేమో ననుకొన్నాను—అప్పటికీఅననుకూడాఅన్నాను. ఎక్కడికీపోవద్దమ్మా ఆచెంబెడునీళ్ళూ, నేనేపోస్తాను, నీవుహైరానాపడి ఎక్కడికీ పోవద్దూఅని. మరి ఏమనుకున్నారో ఏమోఆమే బెజవాడ ఆసుపత్రికి ప్రయాణంకట్టింది. వెళ్ళేముందు నాదగ్గరకువచ్చి నమస్కారంపెట్టి వెళ్ళొస్తానంటే, నేనూ బొట్టుపెట్టి, ఇంత పసుపూకుంకుమా, రెవికగుడ్డాఇచ్చి, కూర్చోపెట్టుకొని గంట బోధించాను. అమ్మాయీ, ఆచెంబెడునీళ్లూ పోసుకొని ఆ బిడ్డను ఆసుపత్రిలోవదిలేసి, నీవుఇరవై యొక్కరోజున వెళ్లి పోయిరాఅమ్మాఅని. ఈయనచాలా యోగ్యుడు, ఆపిల్లలను నీవుదయతోచూస్తే, నిన్నునెత్తిపెట్టుకుంటాడు. ఆయనకూ యాభై, అరవై రూపాయలజీతం, మహారాజులాగ గడుస్తుం దినీకు. చప్పున వెళ్ళిపోయిరా,'' అని ఎంతో చెప్పాను.

ఆ అమ్మాయిఇల్లాగ చెప్పింది. ''ఆయనభార్యకామాలు, మీకుతెలుసుగా. నాకు ఆజ్వరంలోకనపడి, నీవే నాపిల్లలకుతల్లివిగాఅమ్మా అనిబ్రతిమలాడినట్లు చెక్కిళ్ళు నొక్కింది. ముద్దెట్టుకొంది. నేనుంటేనీపిల్లలకు తల్లిలేనిలోపం సాధ్యమైనంతవరకు తీరుస్తానమ్మాఅని నమస్కారంకూడా పెట్టుకొన్నాను. నాబిడ్డవిషయమైయే ఆలోచిస్తున్నాను.''

బిడ్డవిషయమై గట్టిగాచెప్పితే ఆవిడమనస్సు ఎక్కడ నొచ్చుకుంటుందో అనిభయపడుతూనేవదో లోకంలో విషయం లాగ చెప్పాను. ఆబిడ్డనుఎవరికైనా అప్పజెప్పి ఈయనను వివాహం చేసుకోమని. "నాకూ, ఇకమిగిలిన వయఃకాలము వైవాహిక జీవితంలో గడపాలనిఉంది. నేను వివాహంచేసుకుంటానికి, ఇంతకంటే సత్పురుషులుఎవ్వరుదొరుకుతారు" అంటూ, బిడ్డవిషయమై, ప్రేమబంధాన్ని తెంచుకున్నట్టు, విరక్తిగానే మాట్లాడి, ఇరవైయొక్కరోజున తప్పక వస్తానన్నది.

ఆవిడ బెజవాడ వెళ్ళి చాలారోజులైంది. పురుడొచ్చి కూడా నెలదాటిపోయింది. ఆడపిల్లను కన్నది. కాని ఇంత వరకును వచ్చేజాడలేమీ కనబడలేదు. ఎందుచేత ఉదాసీన భావంతో ఉన్నదో నేనుగ్రహించలేకుండాఉన్నాను. మనస్సు ఏమన్నా మార్చుకొందోఏమో! మాస్టరుగారు నాలుగైదు ఉత్తరాలు వ్రాసినాకూడా ఒక్క ముక్కయినా జవాబు వ్రాసిందికాదు అని విన్నాను. డాక్టరుగారు వెళ్ళి కనుక్కొని వచ్చి ఇల్లాగ అన్నారు,

"నెలపురుడు వెళ్ళిందట. ఆమె విరక్తిమార్గంలో ఉంది. అసలు ఆమెకువివాహేచ్ఛలేదు. నాయందుమాస్టరు గారియందు ఆమెకు కృతజ్ఞతలేకపోలేదు. కాని మనస్సుక్రీస్తు ప్రభువుకు అంకితమై పోయింది. ఆమిషనరీ మిస్సమ్మలు ఆమె మనస్సును హరించారు. నేను చూచి నప్పుడు ఆమె చూపులే మారిపోయినై. ధ్యాన భారంతో, అర్థ నిమీలిత నేత్రాలతో, లజ్జా వినమ్రారుణ కపోలాలతో

ఆమెనాకు ఇలాగ జవాబుచెప్పింది. నేను బిడ్డను వదలలేను బిడ్డతో గృహిణీత్యాగానికి అనర్హాను. కాని పూర్వమువలె నేనిపుడు దిక్కులేనిదాననుగాదు. ఏసుప్రభువు నాకు దిక్కు. నేను పూర్వమువలె నశోకను కాను. ఇపుడు నేను విగత శోకను. పూర్వమువలె నేను అభాగినినికాదు. క్రీస్తుప్రభువు కృపావృష్టిచే సుభాగినిని. పూర్వమువలె అవమానాగ్నిలో కాలి బొగ్గయిన క్షుద్రజీవిని కాదు. పశ్చాత్తాపాగ్నిలో నా పాపములను కడిగికొనిన పరిశుద్ధాత్మను. ఏసుప్రభువే నాజీవితమునకు దారియే నాజీవితపథము అని ఇల్లాగ మాట్లాడింది. ఆమె మనస్సు పూర్తిగా మారి పోయింది. మనలోకపు గొడవే లేదు.''

పాపం మాస్టరుగారు, ఆపిడనేకాని వివాహంచేసుకోననిపట్టుగాఉన్నారు. ఎల్లాగ పరిస్థితులు పరిణమిస్తయో అని ఆదుర్దాగా ఉంది.

ఆమె

డాక్టరుగారు వచ్చినపుడు నేను ఆయనవలన విన్న సంగతులు నాహృదయాన్ని కలిచినయి. నాకడుపులో చల్ల చేసినట్లుంది. ఆయనగారు నన్ను తప్పఇంకొకర్తెను పరిణయమాడరట. నేను ఆయనబిడ్డలను ప్రేమతో ఆనెలరోజులూ చూడటమే ఆయనఅల్లాగ నిశ్చయించుకోవటానికి కారణం. ఆయనయందు నాకు అపరిమితమైన కృతజ్ఞత ఉంది. దిక్కు

లేక, అడవులపాలై ఉన్నదానిని ఆదరించారు. ఆయనజీవిత కథవిన్నతరువాత, ఆయనయందు నాకు జాలికలిగింది. నాకు జబ్బుచేసినరోజులలో ఒహో ఎంత దయజూపారు! రాత్రింబ వళ్ళు నామంచంచుట్టూతిరిగారే! అయ్యో ఆబిడ్డలు దీనదృ క్కులతో దగ్గరగానుంచొనివున్నదృశ్యం ఇప్పటికీ నాకళ్ళకు కనబడుతున్నది. ఆతల్లి లేని పసికూనలను సాకమనికదా ఆఇల్లాలునాకు రాత్రిళ్ళు కనపడి దీనవదనంలో ప్రార్థించింది. నేనెంతకృతఘ్నురాలను! పాపం, దుఃఖం ఆయనముఖంలో కరడుగట్టిందే? ఆయనజీవితాన్ని చుట్టివేసిన చీకట్లను పార ద్రోలి, ఆఇంట్లోదీపంపెట్టి, ఆపసికూనలనుప్రేమతో పెంచ టంకంటే ఉత్కృష్టకార్యమేముంది! ఆయన తనహృదయ వేదనఅంతానాకుచెప్పుకొన్నాడే! నవనీతంలాంటి హృదయమే ఆయనది! ఇంకొకరైతెఆయనకుభార్యఅయితేనావలే ప్రేమగా ఉండదు. లోకంతీరే వేరు జీవితంలోఉండే కాఠిన్యము నాకు తెలిసినంతబాగా ఇతరులకు తెలియదు. పిల్లను గన్నదాన్ని గనుకమాతృత్వంయొక్క ఉత్కృష్టతనాకు తెలుసును. నా బిడ్డను నేనిక్కడవదిలి ఆయదనగ్గరకుపోతాను. బిడ్డనువదిలి ఉన్న నేనుమాత్రమే బిడ్డను పోగొట్టుకొని బ్రతకటం అంటే ఎంతభారమో, గ్రహించగలను. ఆయన హృదయగతమై, చెదపురుగులవలె తినేస్తున్న ఆదుఃఖం ఏమిటో నేను మాత్రమే గ్రహించగలుగుతాను. ఆదుఃఖం యొక్కభయం కరస్వరూపం ఇతరులు గ్రహించలేరు. తృప్తిపడని నాలోని మాతృప్రేమభారమైనిరుపయోగంగాఉంది. ఆప్రేమవాహినిని

మాతృప్రేమకై అటమటించే ఆతల్లి లేని పిల్లలతృష్ణను తీర్చేందుకు వినియోగింపవచ్చును. జీవితములో నేను పడిన కృష్టాలయొక్క అనుభవసాహాయ్యమున, ఆయనహృదయా వేదనా,దుఃఖమూ, కొంతవరకుగ్రహించి, ఆదుఃఖభారమును నేనుకొంతపంచుకొని, ఆజీవికి కొంతసాయము చేయగలను. శోకవాహినిలోకొట్టుకొనిపోతూవున్న ఆయనకు నేనుచేయూత ఈయగలను. అట్టిసత్పురుషునిఇంట్లో చీకట్లనుపారదోలి దీపం పెట్టటంకంటె, గాడ్ స్వర్కు ఇంకేముంది. నేనే ఈపని చేయాలె. ఆకుటుంబానికి నేనుతప్పఇంకెవ్వరూతోడ్పడలేరు. నన్నుతప్పఇంకెవ్వరినీస్వీకరించనని ఆయనఅంటూనేఉన్నారు. ఒకవేళస్వీకరించారో ఆయనబ్రతుకుమోయలేనిభారం అయి పోతుంది. ఆపిల్లలుకష్టాలపాలు అవుతారు. నేనుమాత్రమే రక్షించగలకుటుంబంఅక్కడఉండగా, నేనుపట్టించుకోకుండా నిర్లక్ష్యంగాఊరుకోటంకంటే పాపంఇంకోటిలేదు. అందులో అటువంటిపాపం,ఎవరిఎడల నేనుఆచరించటం? దిక్కులేక రహదారిలో పడియున్నపుడు తీసుకొనివచ్చి నెలరోజులు ఆదరించి పంపినదయార్ద్రహృదయునిపట్లనా? నాకుకృతజ్ఞత అనేదే లేదా? ఇట్టిపాపము నేను చేయనా? క్రీస్తుప్రభువు పొరుగువానినికూడ ప్రేమించి, చేయగలసాయముచేయమని చెప్పినారు. నన్ను ఆదరించిన పెద్దమనిషికి, నేనొక్కర్తెను మాత్రమేచేయగలసాయమును నిరాకరించి తిరస్కరించేదా? అయ్యో! నేనెంత పాపిని. ఎంత త్యాగమైనాచేసి, ఈబిడ్డను

ఇక్కడేఇచ్చివేసి, ఆయన కుటుంబాన్ని కాపాడుతాను అని ఇల్లాగ నేనుఒకరోజున తలపోస్తున్నాను. ఇంతలో నాబిడ్డ ఉయ్యాలలోఏడ్చింది. నేను వెళ్ళిఎత్తుకొన్నాను. నాబిడ్డ స్తన్యపానంచేసింది. ఆఎలక్ట్రిక్ దీపాలవెలుగులో ఆపసిబిడ్డ మిసమిసలాడుతూ మెరిసిపోయింది. బోసినవ్వులు వెళ్ళబోసింది. మీగడతరకలవలె, వెన్నెలపొంగువలె,ఉన్న ఆబోసినవ్వులకు నాహృదయకమలంవిప్పారింది. ఆబిడ్డపాలు త్రాగుతూఉంటే నాకుఒళ్ళంతాగగుర్పాటుకలిగింది. అనిర్వచనీయమైన ఏదో సౌఖ్యం,జలదాంచలాల్లోచిక్కుపడ్డతటిల్లతలాగ నాదేహంలో చిక్కువడిసుళ్ళుతిరిగింది. ఈతల్లిని, ఈధగధగ మెరిసిపోయే తల్లిని,వదలివేయాలిసిందే!! వదలివేసి, నాతనూలత ఏవృక్షాన్నో ఆశ్రయించకపోతే బ్రతికేదిఎలా? నాఅవినీతికి ఫలితమైన ఈబిడ్డతో నన్నెవ్వరుస్వీకరిస్తారు అని అనుకొన్నాను. కాని పాలమిసమిసలతో ధగధగలాడిపోతున్న నాపసిబిడ్డను జూచినపుడు మళ్ళీ నానిశ్చయంసడలిపోయేది. ఈసందిగ్ధావస్థలోనే ఇంకా ఉన్నాను.

## ఆయన

ఆమెకువివాహేచ్ఛే లేనట్లున్నదని డాక్టరుగారు చెప్పినప్పటినుంచీనాకు మనస్సు మనస్సులోలేదు. మతిపోయింది. నేనామెయావనమును ఆశించలేదు. ఆమెబుగ్గలనునుపుజూచిగాని, ఆమె కేశములమెరుపుజూచిగాని, నేనుభ్రమచెందలేదు.

నేనామెను ప్రేమిస్తున్నాననిగాని ఆమె సౌందర్యము అనుభ వించక బ్రతుకలేనననిగాని నేననను. ప్రభావతిని ప్రద్యుమ్నుడు కోరినట్లు, నేనీమెనువరించటంలేదు. పృథ్వీరాజు సంయుక్తను అమాంతంగా గుర్రంమీదఎక్కించుకొని తీసికొని పోయినట్లు నేనామెను తీసుకొనిపోవటానికి సిద్ధంగాలేను. నాది అసలు ప్రేమేకాదు. కాని, ఆమెకుతప్ప ఇంకెవ్వరికీ నాగృహంలో స్థానంఇయ్యనని నిశ్చయించుకొన్నాను. ఇదిఒకకోరిక, ఒక స్త్రీనిగాఢంగాప్రేమించి, ఆస్త్రీ లభించనపుడు, కాముకుడు పడేబాధకున్నూ నేనుపడే బాధకున్నూ పోలికలేదు. ఆతని కోరికకు ఉండేతీవ్రత ఉద్వేగము నాకు లేవు. నిష్ఫలమనో రథుడై ఆతడు మరణించవచ్చు. ఆతని కోరికకు అంత పదును ఉంది; ఆకోరిక ఆతనిప్రాణాలుతీస్తే తీయనేవచ్చు నన్ను ఆకోరిక ఏంచెయ్యలేదు. కాని ఆమెవస్తేనాకుసంతో షము. ఇవే నాభావాలు.

నేనువ్రాసినఉత్తరాలకు ఆమె జవాబు వ్రాయలేదు డాక్టరుగారినిపంపితే సరియైన సమాధానం చెప్పలేదు. ఆమె తనబిడ్డతోకూడా రావలయుననికాబోలు కోరుతున్నది. నేను ఆబిడ్డనుస్వీకరింపలేను. పవిత్రమైన వివాహసంబంధానికిఫలిం చిన ఫలముకాదది. ఏచెట్టున కాచినకాయోఅది. ఎట్టి విష ఫలమో, ఆబిడ్డతోకూడావస్తే ఆమె ప్రేమఅంతా ఆబిడ్డ పైనే వలకబోసి నాబిడ్డలను చూడదేమో! ఆబిడ్డనూ నా బిడ్డలనూకూడా ప్రేమగాచూడగల శక్తి ఆమెకు ఉన్నది.

అనుకొన్నా, నేను బిడ్డను స్వీకరించలేను. ఎందుచేతనో నా మనస్సు ఒప్పటంలేదుకాబట్టి ఆమె నాకు అలభ్యయే అని ఇల్లాగఅనుకొన్నాను. తర్కించుకొని తర్కించుకొని ఆనిశ్చయానికొచ్చాను. అప్పటికి సాయంత్రం అయింది. పక్షి మూకలు అర్థచంద్రాకారమున ఆకాశమండలములో ఉన్నవి. సూర్యాస్తమయం అవుతున్నది. పశ్చిమదిశను ఎర్రని జండాలు ఎగురుతున్నట్లుగా మబ్బులుగాలిలో తేలిపోతున్నవి. ఇంతలో చీకట్లు కమ్ముకొన్నయి. ఆపశ్చిమ దిక్కుయొక్క వైభవములంతా ఎంతలోకిమాసిపోయింది! అంతలో విద్యుద్దీపములు చటుక్కునవెలిగినై. నాగుండెలో గుబుక్కుమంది.

## ఆమె

నేను యింతవరకు ఆసుపత్రిలోనే ఉన్నాను. బిడ్డకు మూడోనెలవచ్చింది. ఒళ్ళుచేసింది. లేత తమలపాకులాగ నవనవలాడుతూఉన్న దానిమృదుశరీరాన్ని ముట్టుకోటమే సంతోషమునాకు. ఆదొండపండ్లవంటి ఎర్రని పెదవులతో నొక్కి అది పాలుతాగుతూవుంటే నాకు గగుర్పాటుకలిగేది.

నాభావిజీవితాన్నిగురించి నేను ఆలోచించసాగినాను. మూడోనెలవెళ్ళకమునుపే నేనేదోఒకజీవితపథాన్ని నిర్మించుకోవాలె. ఈబిడ్డను నాయిష్టమైతే ఇక్కడ వదలి వేయవచ్చు. వదలివేసిన నేనెక్కడికైనా వెళ్ళిపోవచ్చు. అది ఒక మార్గము. లేక ఆసుపత్రివారు నాకునర్సింగుపని నేర్పి మిషను

ఆసుపత్రులలో ఎక్కడైనా ఉద్యోగంఇస్తానన్నారు. అప్పటికీ పిల్లలనునావద్ద వుంచుకోటానికి వీలు లేదు. మిషనువాళ్ళు చూపేమార్గంలోనాకు, నాబిడ్డతోకూడా, నివసించటానికి వీలు లేదు. కాకపోతే స్నానంపొంది ఎవరినైన క్రైస్తవుని వివాహమాడితే నాబిడ్డతోకూడా నన్ను స్వీకరించే వరుణ్ణి చూపెడతామని అమ్మగారన్నది. నాకు క్రీస్తుప్రభువుయందు భక్తివుంది. కాని కులంగానికులంలో ఏనిమ్న జాతిపురుషుణ్ణో వివాహమాడటంఇష్టంలేదు. అంతకంటే మరణము వెయ్యిరెట్లు మేలు. పిల్లనుతీసుకొని ఈవిశాలప్రపంచములోకి పోతినా బ్రతికేమార్గం నాకుకనుపించలేదు. నాకున్న విద్యతో ఏచిన్న ఉపాధ్యాయినిగానో ఉండవచ్చునుగాని ఒంటరిజీవితంలో ఉండే సాధకబాధకాలు నాకు తెలుసు. చాలా ఆపదలున్నాయి. మనసంఘంలో స్త్రీస్వతంత్రంగా జీవించటం బహుకష్టం. మన సంఘంలో స్త్రీ అబల. ఆమె ఆతన్గూలతను ఏ వృక్షాన్నో ఆధారంచేసికొని పోషించుకోవలసిందేకాని మరోవిధంగా బ్రతకటంకష్టం. వివాహందాకా వస్తే నేనే కావాలనిఅర్థించే దయార్ద్రహృదయుని కాకమరెవ్వరిని స్వీకరించగలను? లేక నాకన్నబిడ్డను పెంచుకోవచ్చునని ఆశతో ఏసంబంధమూలేని క్రైస్తవునొకని పరిణయమాడనా? అట్లుఎప్పటికీ జరుగదు. నేనుఒంటరిగా అసహాయనై జీవింపనూలేను కాన ఆయనను వివాహమాడటమే ఉచితము.

పాపము ఆయన బిడ్డలతో ఎంతసతమతం అవుతున్నాడో. ఆయన ప్రొద్దున్న పోయి సాయంత్రంవస్తారు. ఈమ

ధ్య ఆపిల్లలమంచిచెడ్డలు కనుక్కునేదిక్కే లేదు. మరీ నోరు లేని ఆపసిపిల్ల తండ్రివచ్చేంతవరకు బిక్కమొఖంతో దిగులు పడి తిరుగుతూఉంటుంది. నేనున్న నెలరోజులూ ఆపిల్లలు ఎంత సంతోషించారో జ్ఞాపకం తెచ్చుకొంటే గుండెఝల్లుమంటుంది. ఆపసిది నాతో ఆడుకొని నాకొంగుపట్టుకొని తిరిగింది.

నేను వండిఅన్నంపెడితే ఆపిల్లలు ఆప్యాయంగా తిన్నారు. ఆనాలుగురోజులూవాళ్ళముఖాలుకళకళలాడినయి. ఆయనకూడాఎంతోతృప్తిని కనబరచాడు. నేనక్కడఉండి ఆయనజీవితంలో ఒకఆశను పుట్టించాను. జనకునిచేత పరిత్యజింపబడ్డనన్ను, విధిఆయన గృహప్రాంగణానికి చేర్చింది. దిక్కులేని సమయంలో ఆయన యిచ్చిన ఆతిథ్యము నన్ను రక్షించింది. విధియే నన్ను అక్కడికి తీసుకొనిపోయింది. ఆయన యందునాకు అపరిమితమైన కృతజ్ఞత ఉంది. ఆ పిల్లల యందు నాకు అమితమైన జాలికలిగింది. నేనిక జీవించే మార్గమే కనపడటంలేదు. ఆ సత్పురుషుని అండ చేరటమే నావిధి. కొరిందీయులకు ఏడవ అధ్యాయములో ఏడవ భాగము మూడవ వాక్యము ప్రతివానికిని స్వభార్య వుండవలయును. ప్రతి స్త్రీకిని స్వభర్త యుండవలయునని చెప్పుచున్నది. తొమ్మిదవ వాక్యంలో విధవరాండ్రుకూడా వివాహమాడవచ్చునని చెప్పియున్నది. నేను ఆయననే వివాహమాడెదను. దయామయుడై లోక కళ్యాణముకొరకు ఆత్మార్పణముచేసి, మన పాపములన్నియు భరించుటకు

సిద్ధముగనున్న ఏసుప్రభువు సువార్త అజ్ఞానులకు చెప్పుటకు నా ఈచిన్నకుమార్తెను ఆయనసేవకై హృదయపూర్వకముగ అర్పింతును అని నిశ్చయానికి వచ్చాను. నాబిడ్డను తీసుకొని పోయి అమ్మగారిచేతులలో పెట్టాను. "తల్లీ ఈబిడ్డ ప్రభువు బిడ్డ. ఈమెనుపెంచి పెద్దదానిని చేసే భారము మీదే. నే నీమెకు ఇక తల్లిని కాదు మీరేతల్లి. ఆఏసుప్రభువే తండ్రి. ఆడదిక్కులేని ఒకకుటుంబము నాసేవనూ నాసాహాయ్యమునూ అపేక్షించుచున్నది. ఆకుటుంబమునకు నేను ఋణపడి యున్నాను. ఆయన నేను గొప్పఆపదలో ఉన్నప్పుడు దగ్గరకుఆదరించాడు. ఆకృతజ్ఞతాభావమే కాక, ఆకుటుంబము ఉన్న దీనావస్థలో ఆడదిక్కు కావాలె ఆడసహాయ్యం కావాలె. నేనుతప్ప ఇంకెవ్వరు అట్టి సాహాయ్యం ఆయనకు ఇయ్యలేరని నానమ్మకం. ఆకుటుంబీకుని ఇంట్లో నేను నెల రోజులున్నాను. ఆయన పిల్లలతో పడుతున్న కష్టాలు తెలుసుకొన్నాను, ఆపిల్లలకు నేను మాత్రమే తల్లిని కాగలను. నాపిల్లను కాపాడటానికి మీరుఉన్నారు. "ఆపిల్లలు దిక్కులేక అల్లాడుతున్నారు. ఆదీనులను పోషించి పెద్దవాళ్ళను చేయటం నీవిధి. నీజీవితాన్ని ఆకుటుంబానికిసేవ చేయటంలో గడప"మని ఏసుప్రభువునాకు ఆజ్ఞాపించినట్లు నేను భావిస్తున్నాను. కాబట్టి ఈబిడ్డనుమీరు స్వీకరించండి నన్ను దీవించి, నాసాహాయ్య మపేక్షించి నన్ను అర్థించినవారిసేవకై వెళ్ళటానికి అనుజ్ఞ ఇవ్వండి" అని నేను అమ్మగారిని ప్రార్థించాను.

నానిశ్చయాన్ని ఆమెఆమోదించింది. నేను తీసుకొనివచ్చిన పసిబిడ్డను ఆమె చేతులలోకి తీసుకొని "ఈమె బిడ్డను నేను కృపావతియను నామకరణము చేయుచున్నాను. ఆయురారోగ్యములు గలిగి, పెరిగి పెద్దదై, ఈబిడ్డ తన జీవితమునంతయు ఏసు ప్రభువుయొక్క సువార్తను నాల్గువైపుల వ్యాపింప జేయటానికి వినియోగించుగాక. అట్టిసత్కృషి చేయుటకు ఆమెకుసమ్యక్ వాక్కును సద్బుద్ధియు సత్ శక్తియు నీవు ఆమెకు ప్రసాదింతువుగాక. పరలోకమందున్న మా తండ్రీ, నీనామము పరిశుద్ధపరచబడుగాక. నీరాజ్యము వచ్చుగాక. నీచిత్తము పరలోకమందు నెరవేరుచున్నట్లు భూమియందును నెరవేరుగాక, ఆమెన్" అని అమ్మ నిమీలిత నేత్రములతో హృదయపూర్వకముగా ప్రార్థన చేసినది.

## ఆ య న

సంవత్సరాది వెళ్ళినమర్నాడుమా బావగారువచ్చి "ఏంరా నీవు వివాహంచేసుకుంటావనివిన్నాను నిజమేనా" అన్నాడు. "చేసుకుంటే చేసుకుంటాను" అని నేనన్నాను "ఎవరో ఒక వితంతువు ఈమధ్య నీఇంట్లో కొంతకాలం ఉండిపోయిందనీ, ఆమెనేనీవు పెండ్లాడుతావు అనీ అన్నారు. అయితే నిజమేనన్నమాట! ఆ నేనూ, అదేదో గాలి కబురనుకొన్నాను అయితే...ఆఅమ్మాయీ..."అని అక్కడఆగాడు, చెప్పబోతున్నమాట మింగేసి "చెప్పు బావాచెప్పు. ఏమిటో అనబోయి ఆపావు" అన్నాను. మాబావ అటూ ఇటూ చూసి

సందేహిస్తూనే, "నీకుకోపంవద్దు. ఆవిడబిడ్డను కన్నదటగా!" అన్నాడు, అతిరహస్యంచేప్పే ధోరణిలో. "అవును" అన్నాను నేనుతొణకకుండా. "ఆఁ ఆఁ ఆగొడవ అంతా తెలిసికూడా ఆవిడనే వివాహం ఆడతావూ? అయ్యో! అయ్యో! నీకేం కర్మంరా! నిక్షేపంలాంటి కుటుంబంలోపుట్టి, అవినీతి జీవితం జీవించినమనిషిని కట్టుకోటం నీకేంకర్మంరా?"అన్నాడు.

"అవినీతి ఏమున్నది?" అన్నాను నేను.

"అవినీతికాకపోతే గర్భంఎల్లావస్తుంది? పిల్లలు ఎల్లాగ కంటుందీ? గాలికి పుడతా(రా పిల్లలూ?"

"పెద్దఅవినీతి ఏమీలేదు. జీవితంలో ఒక్కసారి బురదలోపడ్డది. కడుక్కుంటే పోతుంది. జీవితాన్ని అంతాబాధిస్తుందా?" అన్నాను నేనే.

"ఆఁ,ఒక్కసారే దిగిందో! ఇరవైసార్లేదిగిందో! బైటికొచ్చింది ఈఒక్కటే!" అన్నాడు మాబావముఖంచిట్లించి.

ఈమాటలు నాహృదయాన్ని ముళ్ళలాగ గుచ్చుకున్నాయి. నామనఃక్లేశము కొంతసేపు మౌనరూపాన్ని పొందింది. తరువాత ఆలోచిస్తే ఆమాటలో తప్పేమీ కనపడలేదు. ఆమాట మాబావ తొందరపడి అన్నదీకాదు అని కూడా తోచింది. నేనేమీ మాట్లాడలేదు. నేను మౌనంగా ఉండటంవల్ల మాబావ నేను మెత్తపడ్డా ననుకొన్నాడు.

"అసలునీకు వితంతువివాహం ఏం ఖర్మంరా నాయనా నీకు కావాలంటే రేపు ఈపాటికి సదాచారసం పన్నులైన

కుటుంబంలోనుంచి నిక్షేపంలాంటి పిల్లను తీసికొనివచ్చి జైమంటూ వివాహంచేయగలను, ఏమనుకున్నావో?నీవువిరక్తిమార్గానఉన్నావూ, విధురుడిగా ఉండదల్చుకున్నావూ, అని నేననుకొన్నాను, ఇన్నినాళ్ళనుంచీ. నాతో యీవిషయం మాటమాత్రంఅంటేనీకు ఎప్పుడో అయిపోయేది వివాహం అయినా ఇప్పుడుమిగిలిపోయింది ఏమీ లేదుగా'' అని జవాబును ఆశిస్తూ నావైపు చూశాడు.

''ఏమీ లేదు నేను ఆశపడటమే కాని ఆమె ఇంతవరకూ వివాహానికై తన అంగీకారాన్ని నాకు తెలియపర్చలేదు. అసలు ఆమెకువివాహేచ్ఛ లేదనికూడా నేనే విన్నానన్నాను.''

''అటువంటివాళ్ళు పెండ్లాడి పెసిమిటితో నిలకడగా కాపురంచేస్తారటరా! నీ వెర్రికాకపోతే!సరే ఆమెమాట ఇక తలపెట్టకు. ఇప్పటికాలంవాళ్ళు ఏదో ప్రేమించామనీ, ప్రేమకోసంప్రాణాలుఅర్పిస్తామనీ, ఏదో వెధవవెర్రిమొర్రికబుర్లేవో అంటూఉంటారు, అటువంటిది ఏమీ లేదుగద!'' అన్నాడు మాబావ, ఏవోసంశయాలు మనస్సునుబాధిస్తున్న వాడిలాగ నావంకచూస్తూ. ''ప్రేమా లేదూ...ఏమీ లేదు. కాని ఆమె నాకు ఎక్కువగాఅక్కరకువస్తుందని నానమ్మకం''-అన్నాను. ''నీనమ్మకాని కేంలే! ఎవర్ని చేసుకుంటే వారే అక్కరకొస్తారు......నీకెందుకు నీవు ఇక ఆమాట ఎత్తకు'' అని నన్ను రెక్కపట్టుకొని కుర్చీలోనుంచి లేవనెత్తటానికి ప్రయత్నిస్తూ ''రా! నాతో కొంతదూరంనడు. మాట్లాడుతూవస్తే

నేను ఆపేటలోవున్న ఒకరితో మాట్లాడి రైలుకు వెళ్ళిపో
తాను.''అన్నాడు. నేనులేవటానికి ఇష్టపడకపోవటాన్నిగమ
నించి ఆయనకుర్చీలో గభీలునకూలబడి ''ఒరే!నీవూ, ఇతంతు
వివాహంచేసుకొంటానని అన్నావు. నేనుగనుక రాకపోతే
చటుక్కున చేసుకొనేవాడివేగద! మీఅక్కయ్య ఏదో గాలి
కబురుగావినే మొన్నటినుంచీ ఒక్కటేఇదౌతున్నది. పిల్లలు
గలవాడివిగదా. వాళ్ళకుపెండ్లిళ్ళు ఎల్లాగ అవుతయ్యి అను
కున్నావురా? ఏమిటిసంగతి?'' అన్నాడు.

''ఆసుసికిపెండ్లిఅయిందికదా, ఇవ్వాళో రేపో అది
అత్తవారింటికి వెళ్ళిపోతుంది. ఇక ఆపసిది! దానికి పెండ్లీడు
వచ్చేసరికి ప్రపంచం ఎల్లాగ మారుతుందో! ఆమగపిల్లల
విషయమై అంటావా.నాకేమీదిగులులేదు''అన్నానునేను.

''దిగులుఎందుకు లేకపోవాలె? వాళ్ళుమట్టుకునీపిల్లలు
కారా? ఆపసిదాన్ని తన కొడుక్కుఇచ్చి చేసుకోవాలెనని
మీఅక్కయ్యఅనుకుంటూఉన్నది. మీకూ,మాకూ, ఎన్నో
తరాలనుంచీ వస్తూన్నవి సంబంధబాంధవ్యాలు. ఈనాటితో
తట్టతగలేసుకొంటామా?ఆలోచించావు మహాగొప్పఆలోచన
చాల్లే! ఆవివాహమే అయితే నీకొంపకు ఎవడైనా వచ్చే
వాడుఉంటాడేమోఆలోచించుకో'' అనినిక్కచ్చిగా చెప్పాడు
ఆయన. మనస్సులో చాలా బాధపడినవాడివలె చూస్తూ.
నాకూ ఏమీతోచలేదు. ''మరివివాహం చేసుకోక పిల్లలూ
నేనూ అవస్థలపాలు కమ్మంటావా?'' అన్నాను.

"ఆమాటఎవరన్నారు? నేను మొదటినుంచీ చెబుతునే ఉన్నాను. ఏదో ఒకకులమింటిఆడబొడుచును ముడివేసుకోమని. నీవు అప్పుడు ఏమన్నావు? ససేమిరా నాకు వివాహం వద్దు అనలేదా? సరే ఆతల్లీ ...... నీబిడ్డా పోవటం, నీకు దిక్కులేక పోవటం——అన్ని కష్టాలు భగవంతుడు తెచ్చి పెట్టాడు. ఏంజేస్తాము? కానీఇప్పుడు నీవు వితంతు వివాహం తలపెట్టటంమాత్రం ఏమాత్రం బాగుండలేదు. "నా" అన్న వాళ్ళు లేకుండాపోతావు సుమా ఇల్లాంటి పనిచేస్తివా! తెలిసిందా? లే అల్లావెడదాము రా." అన్నాడు. నాకూ ఏమీతోచిందికాదు. ఏమాటా అనలేకపోయినాను. సరేనని ఆయనతో బయలుదేరినాను. ఆయననన్ను ఊళ్ళోకితీసుకొని వెళ్ళాడు. దారిపొడుగునా నాకుచెబుతునేఉన్నాడు. విధవా వివాహంచేసుకోవటంవల్ల నాకుకలగబోయే భయంకరసంఘ తిరస్కారాన్నిగురించీ, నాకురానున్న ఆపదలనుగురించిన్నీ. నాకుచక్కనిదాన్నీ, పెద్దదాన్నీ, అయిన పిల్లలను వివాహం చేస్తానని మాటిమాటికి అంటూ వచ్చాడు. "బావా, నాకు ముప్పైఎనిమిది అనగాదగ్గరదగ్గర నలభై ఏండ్లుఉన్నవే. నాతో పిల్లను చేస్తే ఆపిల్ల ఏమిసుఖపడుతుంది? నే నేమి సుఖ పెడతానూ" అన్నాను.

"చిన్నపిల్లేంఖర్మంరా, పదిహేనేండ్లపిల్లవుంది. గుఱ్ఱం లాగఉంది. నీకెందుకూ నీవు ఊరుకో" అన్నాడు. నే నేమీ ఉత్సాహం కనపర్చకపోవటం మూలాన మళ్ళీ ఆయన

అన్నాడు. 'ఈమాట గాలికబురుగా వినే, మీఅప్ప హడలి పోయి ఏడుస్తూకూర్చుంది నిజంగానే నీవు ఈ వెధవ పెండ్లి చేసు కొంటే దానికిగుండెపగులుతుంది.' అని నన్ను భయపెట్టటం సాగించాడు. నాకు ఆప్తులు అయినవారు ఎవ్వరూ లేరు. మా అప్ప ఒకర్తే నారక్తసంబంధం గల ఆప్తురాలు. దాన్ని ఏడిపించాలిసివస్తుందని కాబోలు నాకు ఆక్షణంలో విచారం కలిగింది. ఆయనవెంట నేను ఎందుకోఎక్కడికో నడిచాను. చాలాదూరం పోయినతరువాత ఒకచిన్న పెంకుటింట్లోకిదారి తీశాడు. "ఎందుకు? ఎవరిఇల్లుఇది? మనకిక్కడ ఏంపని?" అన్నాను. "చెబుతానురా మనవాళ్ళఇల్లే. కొంచెం దాహం పుచ్చుకొనిపోదామురా" అని అంటూ నన్ను రెక్కపుచ్చు కుని లాక్కుని పోయినాడు లోపలికి, ఏబంధుగుల ఇంటికి రానని నేను గోల పెడుతున్నా వినకుండా.

లోపలికి వెళ్ళాము. ఆఇంట్లో ఎదో ఒకబీదసంసారం నివసిస్తూన్నట్లు కనిపిస్తునేఉంది. ఒకహాలులో ఒక చిరిచాప పై నమేమిద్దరం కూర్చున్నాము. రెండుపాతకుర్చీలుకూడా ఆ హాలులోఉన్నాయి. అక్కడిఏర్పాటులనుబట్టి ఆఇంటివారు మారాకఎదురుచూస్తూ ఇట్లా ఏర్పాటులన్నీ చేసినట్లు తెలు స్తునే ఉన్నది.

నామనస్సుబొత్తిగా స్థిమితంగాలేదు. మాబావచెప్పిన మాటలవల్ల వికలత పొందింది. ఏదో భయమూ, దిగులూ నన్ను పట్టుకొన్నాయి ఆలాగే ఆలోచిస్తూ కూర్చున్నాను. ఇంతలోకే ఒక ఆవిడ లోనుంచివచ్చి మాముందు నించుని

ఊరుకొన్నది. నలభై ఏండ్లుఉంటాయి ఆవిడకు. మాబావనన్ను ఉద్దేశించి, "వీడేమంబావమరది, ఈవూళ్ళోనే కాలేజీలో లెక్చరరు నెలకు డెభై రూపాయలు జీతం" అన్నాడు. నేను లెక్చరరునుకాదనీ, నాకు ఇంకా ఒక అయిదురూపాయలు తక్కువజీతమేననీ చెప్పాలని అనుకొన్నాను గాని ఎందుచేతనోఏమోఊరుకొన్నాను. ఆవిడ-"అల్లాగా వీరేనా? మన వాళ్ళం ఈవూళ్ళో నలుగురం ఉన్నామన్న మాటేగాని ఒకర్ని ఒకరంఎరగం. ఆపై పేటలో వీరు ఉన్నారూ అని విన్నాము. అదీకాక వీర్ని గురించి మాపెద్దఅబ్బాయి చెప్తూతూ ఉండేవాడు, బాగాచదువుచెపుతారని. ఎప్పుడూ చూడటం తటస్థించలేదు" అని అంటూ ఆవిడ నావంక చూచింది.

ఆమెను ఉద్దేశించి మాబావ అన్నాడూ, "వీళ్లుమన వాళ్ళే అసలుకాపరం రేపల్లె. ఏదో బీదవాళ్ళే అనుకో పల్లె వదలి బస్తీకివచ్చి ఎల్లాగో పొట్టపోసుకొంటున్నారు. మంచి సాంప్రదాయం"అని చెప్పి ఊరుకొన్నాడు. మామూలుగా ఒకరిని పరిచయం కలగచేసినపుడు చూపవలసిన మర్యాద ననుసరించి, నేనూచిరునవ్వునవ్వితలఊచాను. ఆవిడ ఊరికే నన్ను చూస్తూనిలబడి ఉన్నది. మాబావ లేవడూ. నాకు ఇల్లాగబొమ్మలాగ కూర్చోటం విసుగ్గాఉంది. "బావా ఎందుకూ ఇక్కడకూర్చోటం, మంచినీళ్ళుపుచ్చుకొని వెళ్ళిపోదాంరా" అన్నాను.

ఆవిడవంకచూస్తూ మాబావ "రవణమ్మా వెళ్ళాలట! చిరునవ్వునవ్వాడు, ఈవాలకంచూస్తే నాకేంఅర్థం కావటం

లేదు...“ఒక్క నిమిషం ఉండండీ” అంటూ ఆమె లోపలికిపోయి రెండుకప్పులతో కాఫీ తెచ్చిమాముందు పెట్టింది. నేను వద్దండీ అన్నాను. ఆమె ఎంతో బలవంతం చేసింది. అయినా మాబావ భోజనానికీ, మళ్ళీభోజనానికీ మధ్యఏమీ పుచ్చుకోడు. నేనుపుచ్చుకోనకతప్పిందికాదు. ఆకాస్తమంచి మాటా అయినతరువాత ఇకవెళ్ళుదాంరాబావా అన్నాను కొంచెంసేపు ఆగమన్నట్లు ఆయన చెయ్యి ఊపాడు.

ఇంతలోరమణమ్మగారు పదిహేనుఏండ్ల పిల్లను తీసుకొచ్చి నాముందరనిలబెట్టింది. విషయం అంతా ఇంకా ఎట్లా తెలియకుండావుంటుంది? ఆఅమ్మాయిని నాకిచ్చి వివాహం చేయటానికి మాబావనిశ్చయంచేసి ఉంటాడు. నిజంగా, ఆఅమ్మాయిఏపుగాపెరిగి విరియపూచిన లేతగన్నేరు మొక్కలాగాఉంది. ఆఅమ్మాయి సౌదర్యాన్నివర్ణించటం నాకిష్టం లేదు. పైముక్క అన్నందుకే నా అంతరాత్మనన్ను కొంచెక్కతిన్నది చక్కని పిల్లమాత్రం అవును. ఆరమణమ్మగారు ఆపిల్లకు తల్లిఅయిఉంటుంది. ఆమెకూతుర్ని దగ్గరగా నిలబెట్టుకొని చెక్కిళ్ళఅరచేత్తో దువ్వుతూచుబుకాన్ని వేళ్ళమొనలతో నొక్కుతూ “మీబావగారు అన్ని విషయాలు నాతో మాట్లాడినారు. నాకుఇష్టమైంది పిల్లను మీరు చూచి ‘ఊ’అనటమే తరువాయి అనికూడా చెప్పారు. ఈ పిల్లచాలా బుద్ధిమంతురాలు. ఇంటిపని చక్కగా చేస్తుంది. పిల్లలసంగతీ అదీ చూట్టం తెలుసు ఇల్లంతాచక్కగా తీర్చుకు పోతుంది. నాయనా” అన్నది ఆపిడ నా వంకచూస్తూ.

మాబావ నాకు దగ్గరసాజరిగి "ఒరేయ్ నేనంతా మాట్లాడాను. నిక్షేపంలాంటిసంబంధం. ముత్యంలాంటి పిల్ల. నీకు ఇంకా ఏంసందేహం? చూశావామరి, ఎల్లాంటిసంబంధం కుదిర్చానో! అని మెల్లగా నాచెవిలో అన్నాడు.

నేను పెద్దగా రమణమ్మగారు వినేలాగ, "బావానా వయస్సుఎంతో చెప్పావా?" అన్నాను. "కనబడటంలేదా. మనిషినిచూస్తునేఉన్నారుగదా" అన్నాడు ఆయన. నేను అమెగారినిచూస్తూ "నాకుఐదుగురు పిల్లలండీ, "అన్నాను. 'అవును,నాయనా, నాకు అన్నీ తెలుసు. ఆపెద్దపిల్లపోవటం అన్నీ తెలుసు" అనివిచారంగా అన్నది. "అదికాదు వాడ నటంపెండ్లికొడుకు అయిదుగురుపిల్లల తండ్రి అని మిమ్మలను గ్రహించమంటున్నాడు।' అనిమాబావ వ్యాఖ్యానంచేశాడు. ఆమాటలువిని ఆవిడ "దానికేం, నాయనా, ఇంతింతవాళ్ళ కూఐదుగురూ ఆరుగురూపిల్లలు. వెంటవెంటనే కాన్పులొస్తే ఎంతలోకి! పిల్లలదోలెఖ్ఖా-!" అనినవ్వింది. నేను మళ్ళీ అన్నాను "నాకు నలభై సంవత్సరా లున్నాయండీ" అని. "అయ్యో నాయనా, నలభై ఏండ్లు ఒకపెద్దవయస్సా? నీకేమి యీడు పోయిందినాయినా, మానాన్నకు యాభైయో ఏట నేనుపుట్టాను. మగవాడికి ఏండ్లతోపనేమిటి? దానిఅదృష్ట ముంటే దానికడుపేఫలిస్తుంది" అనిఅంటూ ఆమె నావయ స్సు ఒక ఆటంకం గానట్లు మాట్లాడింది.

కడుపుఫలించడమే కావలసింది? ఆపిల్లకూ నాకూ పొత్తుకుదురుతుందా? అని ఇల్లాగ ఆలోచనలు గప్పుగప్పున వచ్చినవి కాని అవి పొగలాగ తేలిపోయినాయి. అప్పడు నా మనస్సు ఎల్లాగవుందో నేనుచెప్పలేను. వెంటనే ఆపిల్లవంక తిరిగి, ''ఏం,అమ్మాయి నన్ను చేసుకుంటావా?'' అనిధైర్యంగా అడిగాను, పెండ్లికూతుర్ని. పదిహేనేండ్లు ఈడేరిన పిల్లను అల్లాగ అడగటం శుద్ధ తెలివితక్కువతనం అనేఅంటారో లేకగడుసుతనమనే అంటారో, ఏమన్నా అనండి. నేనుమటుకు అడిగేశాను. రమణమ్మగారు తెల్లపోయింది. కానిమరుక్షణంలో తెప్పరిల్లి–''చెప్పవే–చెప్పుఅమ్మా. పెద్దమనుష్యులు అడుగుతూన్నప్పుడు అల్లాగసిగ్గుపడి ఊరుకోరాదు'' అన్నది. ఇంకా ఆపిల్లమాట్లాడలేదు. ''దాని తరువాత గునిసేకంటే మొదట్లోనే ముఖాముఖిని చెప్పుకుంటేమంచిది. నువ్వేమన్నా చిన్నదానివా బుద్ధితెలిసినపిల్లవు, మరి చెప్పేశెయ్యి'' అని తల్లి మళ్ళీ హెచ్చరించింది.

ఆపిల్ల ఒక్క నిమిషం తలవంచి లజ్జపడి ఊరుకొని తరువాతలజ్జారుణ నేత్రాలతో నావంక ఒక్కచూపు చూచి చిరునవ్వుతో తలఊచింది. ఆశిరఃకంపము ఆమె ఇష్టాన్ని స్పష్టంగా తెలియజేసింది.

పదిహేనుపండ్లపిల్లయొక్క వివేకమూ, మంచి చెడ్డల తారతమ్యాన్ని గుర్తించేశక్తి ఇంతేకదా అనుకొన్నాను. నా దగ్గరనుంచిఇల్లాంటిప్రశ్నవస్తే దానికిజవాబు ఇల్లాగ చెప్పవలసి వుంటుందని కూడాఆపిల్లకు నచ్చజెప్పి ఉంటారు. నలభై

మోపడిలో వివాహంవొద్దుఅనుకున్నవాణ్ణి పిల్లలనుకనిపెట్టి చూడటానికి ఆడదిక్కుకోసం ఒకస్త్రీని, వయస్యను వివాహ మాడుటకు మనస్సు మార్చుకొన్నాను. అప్పటికే నాసత్ శీలానికి భంగంవచ్చింది. నాఆదర్శానికి భిన్నంగా ప్రవర్తిస్తు న్నాను. పతితుణ్ణిఅయినాను.

ఈచక్కనిపడుచుపిల్ల, నాకండ్లముందు, లజ్జాముద్రిత వదనంతో, క్రీగంటిచూపుతో, నన్ను అకర్షిస్తూ, నన్ను వివా హం చేసుకొంటానికి ఇష్టపడ్డది అనేసరికి నాహృదయంలో ఒక్క చలనం కలిగింది. కామేచ్ఛనాలోఇంకానశించ లేదని నిజంచెప్పటానికి నాకు భయంలేదు. కామతృప్తిని ఆశించికా జోలు నాలోనిజీవాణువులుఉత్తేజితములైనవి. మోహంతో, క్షుద్ర కామంతో, పశువాంఛతో , ఆమెవంక చూశాను. నేనుపూర్తిగా పతితుణ్ణి అయినాను. పాపపంకంలోకి ఆవాం ఛనన్ను ఈడ్చుకొనిపొయ్యేదేమో కాని, నేను ఒక్కక్షణు టిలో తేరుకొన్నాను. ఈతలుపులన్నీ నామనస్సులో ఒకనిమి షం మెరుపులవలె మెరసిపోయినవి.

... ... ...

నేను చప్పున తలఎత్తి. "ఇల్లారా అమ్మాయీ" అన్నాను, ఈమాటు మాబావకూడా తెల్లపోయినాడు. ఇం దాకటి ప్రశ్న రావచ్చునని వాళ్ళు అనుకున్నారు ఈపిలుపు మాత్రం వాళ్ళకు బహువింతగా ఉంది. నేను అంత పెద్ద పిల్లను దగ్గరకు పిలవటం వెర్రిచేష్టలాగ తోచిఉంటుంది

వాళ్ళకు, రమణమ్మగారు మరీపాలిపోయింది. ఆపిల్ల బెదురు చూపులుచూచింది. మా భావ నోరు జేసుకొని ''ఎల్లావస్తుం దిరా,నీదగ్గరకూ. ఇంకావివాహం కాకముందు? అయినా చిన్నపిల్లా ఏమయినానా?'' అన్నాడు నేను ఆయనమాటలు వినిపించుకోకుండా...''రా,అమ్మాయీ. భయంలేదు'' అని మళ్ళీఅన్నాను...నేనెల్లాగున అన్నానో నాకంఠస్వరంలో ఏవిపరీతార్థం స్ఫురించిందో ఏమోకాని, ఆమె కూతుర్ని మెల్లగా నడిపించుకొనివచ్చినాముందునిలుచో బెట్టింది ''నీ పేరేమి? అన్నాను. అప్పటికి ఆమె భయవిహ్వాలత నుండి తెప్పరిల్లి ''చెప్పవే''అన్నది. ఆపిల్ల ''పద్మ'' అని జవాబు చెప్పింది.

అదివరకే, ఆఅమ్మాయినిచూస్తూ, నాకుమార్తెను, నాబిడ్డను జ్ఞాపకం తెచ్చుకుంటున్నాను. పితృవాత్సల్యభావము నాహృదయంలో పొంగిపోతుంది. నాబిడ్డ బ్రతికేఉంటే సరిగ్గా ఇంతఉండేది. నాబిడ్డఇల్లాంటిస్థితిలోఉంటే నలభైఏండ్లవయ స్సుగలవాడికిస్తానా? అదీగాక నాకుమార్తెవయస్సులో ఉన్న దాన్ని, నేనూ ఏముఖంతో వివాహేచ్ఛతో చూశేది ? ఆవయస్సులోని వాళ్ళంతా నాకు పుత్రికాసమానలు అని ఆందోళనపడుతూన్న నాకు ఈపద్మపేరువినేసరికి పితృవాత్స ల్యమూ పుత్రికా వియోగదుఃఖమూ, ఒక్కసారిపొంగివచ్చి నయి. నాబిడ్డపేరుపద్మ. పద్మఅనేమాట వినేసరికి తుపాకీ దెబ్బతిన్నట్లుగా నాతల రాయిఅయిపోయింది. తరువాత దిమ్మెక్కినట్లుంది తరువాత తిరుగుతూన్నట్లుతోచింది. అటు

తరువాత వికారపెట్టింది. సద్దుకొంది. పద్మఅనే ఉచ్చారణ వలన గలిగినశబ్దం మెల్లగా మెల్లగా నాగుండెను తట్టింది. నాకళ్ళనిండా నీరు నిండింది.

ఆఅమ్మాయి చుబుకాన్ని నామునివేళ్ళతో నొక్కి— "తల్లీపద్మతల్లీ—నన్ను పెండ్లాడుతావాఅమ్మా. వద్దుఇందాకా నవ్వేటోలకు పెండ్లాడుతావా అన్నా. పాబిడ్డపేరూ పద్మ. మాఅమ్మసరిగ్గా సీలంతేఉండేది" అన్నాను. అంతకంటే మాట్లాడలేకపోయినాను. హృదయభారంచేకృంగిపోయినాను

కొంతసేపటికి మళ్ళా అన్నాను. "రవణమ్మగారూ, ఈబిడ్డకు మంచి సంబంధంతెచ్చేభారం నాకు వదిలెయ్యండి. మీారేమీాతొందరపడవద్దు. ధనసాహాయ్యంకూడా చేస్తాను' అనిఅన్నాను. అప్రయత్నంగా నాకళ్ళవెంట బొటబొటనీరు కారినై. పద్మతల్లి ముంజెయ్యి తడిసింది. మాభావ నేనూ బైటికి వచ్చేశాం.

* * * *

ఆవిడ మాఇంటినుంచివెళ్ళిమూాడునెలలైంది. ఈమధ్య నేను వారానికి ఒక ఉత్తరంచొప్పున వ్రాశాను. మొదటి రోజులలో నాఉత్తరాలకు జవాబేలేదు. నాకూ ప్రాణం విసికింది. ఇక నాకు ఆమె అలభ్యయే అని నిశ్చయించుకొన్నాను.

మర్నాడు సంవత్సరాదిపండగ. అందరూతలంట్లుపోసుకొన్ని, కొత్తబట్టలు కట్టుకొని పిండివంటలతో భోజనాలు

చేశారు. ప్రపంచంఅంతా ఆనందంతో పొంగిపోతున్నది బిడ్డలు నవ్వుముఖాలతో క్రొత్తపరికిణీల చెంగులు పైకెత్తి నడుస్తున్నారు. సిందుమల్లెమొగ్గలవలె, ఆరవిచ్చిన గులాబి పువ్వువలె, వచ్చీరానియౌవనంలోఉన్న లేజవ్వనులు వయసు పోకిళ్ళతో, వయ్యారపునడకలునడుస్తూ, కిలకిలనవ్వుతూఅటు పోతూఉండటం నేను గవాక్షంలోనుంచి చూశాను. నాబిడ్డ ఆరోజున క్రొత్తచీరగట్టుకొని పూలు పెట్టుకొని అల్లాగతిరు గుతూ ఉండాల్సింది. మాఅమ్మమీదే ఆశలు పెట్టుకొనిజీవిం చాను. నాతల్లికొత్తచీరకట్టితే ముందునుంచితల్లినిజూచి, అది బజారునకువెళ్ళుతుంటే, వెనకనుంచి దాన్నిచూస్తూ నాబిడ్డ చక్కనిదనిలోలోన ఆనందిస్తూ మలుపుతిరిగేదాకా అక్కడ నుంచునేవాణ్ణి. ఎటుతిరిగివచ్చినా నాతల్లి పిల్లలనుచూస్తుం డేది. వయస్సులో పిన్న అయినా పెద్దభారం వహించింది. ఎంత ప్రొద్దుపోయివచ్చినా మాఅమ్మని పలకరించంది నాకు తృప్తిఉండేదేకాదు. అమ్మచేత ఒక్కత్యాగరాయ కృతిని పాడించుకొని వినందే నిద్రపట్టేదేకాదు. నిద్రలేవటంతోనే అమ్మా, తల్లీ, అని పిలిచేవాణ్ణి. నాకంటే నాతల్లి ముందే లేచిఉండేది. ఏమని చెప్పేది? అది నాజీవిత సర్వస్వము. అదిపోయి ఈపండగకు దగ్గర దగ్గర ఆరునెలలు కావచ్చింది.

ఇంట్లో ఆడదిక్కులేదు. మాభోజనం హోటలులోనే నాతల్లి పోయిన దగ్గరనుంచీ నాస్నేహితులు ఒక్కరూ నా దగ్గరకురాలేదు. ఎక్కడన్నా కనబడ్డా దూరదూరాలకు

తొలగిపోయేవాళ్ళు. నాదుఃఖం నాముఖంలో మార్పు దెచ్చి భయంకరస్వరూపాన్ని ఇచ్చింది. అని నాఊహ. తల్లి లేని నా పిల్లలకు హోటలుతల్లే, తల్లి. ఏదో రెండు మెతుకులు తిని ఇంటికివచ్చాము. కళకళలాడుతూ ఉండాలిసినఇల్లు, బావురు మంటూఉంది. శ్రావణమాసాన పూటుగానిండి, బెకబెక లాడుతున్న కప్పలతోకూడిన ఒకతటాకంలాగ ఉండే మా ఇల్లు, ఆరోజునఎండిపోయిన చెరువులాగఉంది. ఉన్నకప్పలు నాలుగూ డొక్కలు వేలాడేసుకొని బైటపడ్డవి! నిండుతటాకంలో అవి ఎన్నిరకాల అరుపులు అరిచేవి! గొంతెత్తిఎంత ఆనందంతో అరిచేవి! ఇప్పుడుఅరుపే లేదు. తల్లి ఉన్నప్పుడు పిల్లలుఎప్పుడూఎగురుతూఉండేవాళ్ళు, దేనికోసమో మారాం చేసేవాళ్ళు, ఎందుకో పెద్ద కేకలు వేసుకొనేవాళ్ళు, ఎందుకో ఇట్టేఏడ్చేవాళ్ళు మళ్ళీపకపకనవ్వేవాళ్ళు, ఇల్లంతా బెకబెక లాడుతూఉండేది, కళకళలాడుతూ ఉండేది. ఇంటినిండా ఆట వస్తువులే. ఇంటినిండా కాగితపుముక్కలే, విడిచినబట్టలే, ఏమూల జూచినా పుస్తకాలే. ఇప్పుడు ఎక్కడి వస్తువులు అక్కడనే ఉన్నవి. నలుగురు పిల్లలూ ఉన్నా అల్లరి లేదు, కళ లేదు, కాంతి లేదు. ఎండిపోయిన చెరువులాగ ఉంది నాఇల్లు.

తిండితిని ఇంటికొచ్చినతరువాతపిల్లలు తల్లిఫొటోనూ అక్క ఫొటోను ఒకపీటమీాదపెట్టి, వాటికిపూలదండలు వేసివాటి ముందు అగరువత్తులు వెలిగించారు. అది వాళ్ళఆటఇప్పుడు

అది చూచి దుఃఖంఆపుకోలేక బావురుమనిఏడ్చి ఆ పీటమీద నేనూ రెండు పూలు పెట్టాను. లోకానికంతకు పండగదినం, నాకు దుఃఖదినం. పిల్లలు మాసినబట్టలు కట్టుకొన్నారు. నా దుఃఖజీవితానికి ఈజన్మకు సౌఖ్యం లేదు. నాజీవితం అంధకార బంధురమే కాని పసిబిడ్డలజీవితానికి సౌఖ్యంఇచ్చే ఒక్క-ఆడ తోడు నాకు కావాలె నాఏడ్పుకు నన్ను వదిలేసి, ఏడ్వడం తెలియని ఆఅమాయికజీవులజీవితంలోని అంధకారాన్ని ఒక్క-చిరునవ్వుతో పారదోలగల కరుణార్ద్రహృదయ నాకుకావాలె వాళ్ళను సౌఖ్యపెట్టగల స్త్రీ నాకు తోడుకావాలె ఆబిడ్డల చిన్నహృదయాలలో దాగియున్న కాంతులను వికసితపుష్ప ములనుగాదోహదము చేయగల, దయామృతమును సమృద్ధి గావర్షించగలసుగుణవతిని నేనుకావాలెననికోరుతున్నాను. ఈ లేత మొక్క-లను నేను పెంచలేకుండా ఉన్నాను. ఎండవానలు తగులకుండా తన చేలాంచెలపునీడను వాటిని పెంచి అవిచిగి రించి ప్రఫుల్లపుష్పభరితముగునట్లు చేయగల దీనదయాళువు నాకుఅవసరము. తల్లిలేక, పోషణలేక, ప్రేమవృష్టి లేక ఆర్తు లైఅల్లాడే ఈపసికూనలనుతన రెక్క-లచాటునదాచిపోషించ గల పవిత్రురాలునాకు కావాలె. నాజీవితాకాశాన్ని ఆవరిం చిన జీమూతసమూహాన్ని పటాపంచలుచేయగల సద్హృద యనాకు కావాలె. నాకుకావాలె. ఎవరో; ఆమె కావాలె!

ఆమెకొఱకై ఇంతకాలం ఉన్నాను. ప్రతిక్షణం ఆమెనే స్మరిస్తున్నాను. ఆమె రానేరాక "నర్సు" పని నేర్చుకొనిజీవి

తాన్నంతా మానవసేవలో వినియోగిస్తుందేమో నన్న సందేహం నన్ను పట్టుకొన్నది. మిషనుఆసుపత్రి చేసిన ఉప కారం అదీ. ఆమెమనస్సు ఆవిధంగా మార్చారు, మంచిదే. కానీ నాకుఅపకారం జరిగింది. అయినా ఆవిషయం నిశ్చితం గా తెలుసుకుంటే మంచిది. సంధిగ్ధావస్థలోపడి, అనుక్షణమూ అడకత్తెరలోని పోకవలె బాధపడుతూఉండేకంటే ఏదోఒకటి ఇదమిత్థం అని తేల్చుకుంటేనే మంచిదని తోచింది. వెంటనే కలంకాయితం తీసుకొని వ్రాశాను—

ఏమండి...........గారు,

మీరుకులాసాగాఉన్నట్లు తెలుస్తూనేఉందికాని మీరు స్వయముగా వ్రాసిన జాబును చూచుభాగ్యము నాకుకలుగ లేదు. మీరు ఇక్కడ ఉన్నరోజులలో నా హృదయమూ వేదన మీకు తెలియజేశాను. పిల్లలతో నేను పడుతూన్న అవస్థలు మీరు స్వయంగా చూశారు.

మీరుపిల్లలనుఅంత దయతోచూడటంచూచి, మీ హృదయంనవనీతంలాంటిదని, నేనుగ్రహించాను. మీరు నా ఇంట్లోదీపం పెడతారేమో, నాపిల్లలకు అండ అవుతారేమో నని ఆశ కలిగింది. నాభార్య మీకు కనబడి తన స్థానాన్ని మీకు హృదయపూర్వకంగా ఇచ్చింది. మీరునన్నువివాహం చేసుకుంటానికి ఒప్పుకుంటారని నే నింతవరకూఅనుకొన్నాను.

నేను వితంతు వివాహం చేసుకోనటంలోనే కొంత స్వార్థత్యాగం ఉంది. మొన్నమొన్న మాబావ నాకొక పిల్లనిజూపి, వివాహంచేస్తానన్నాడు. నేను నిరాకరించాను. బంధుగులు తిట్టనీ, లోకులు కాకులై కూయనీ, సంఘబహిష్కారం రానీ, మరేమన్నా కానీ, నేనుమాత్రం వితంతువును తప్ప మరొకరిని పెండ్లాడనన్నాను; అందులో ఒకవిధంగా 'శీలంలోమచ్చ' ఉన్న స్త్రీని స్వీకరించడం త్యాగంతో కూడిన విషయమేనని మీరు అంగీకరించాలె. నాఉదారస్వభావం అంతవరకే, నాహృదయ వైశాల్యమూ అంతవరకే. ఆపైకి పోయి, మీబిడ్డనుకూడా స్వీకరించటానికి నామనస్సు ఒప్పటంలేదు. నామనస్సు ఇంకా అంత పరిపక్వంకాలేదు. నామనస్సు ఇంకా అసంస్కృతమనసే, ఇంకా సంకుచితమే అని చెప్పాలె. అంతపనిచేయటానికి ఇంకా హృదయవైశాల్యం, ఉదారత, క్షమాబుద్ధి, కావాలె. నాలోఅవి లేవనే అంగీకరిస్తాను.

కాని నేను చెప్పవలసిన మాట కాదుకాని, ఇంత మాత్రం హృదయపరిపక్వంపొందిన మానిసి మీకు దొరకటం దుర్లభం.

అయినామీరు నాకోరికను చెల్లిస్తారను కొన్నాను. గుర్తుపట్టలేని ఆబిడ్డనుపురిస్కరించుకొని మీరు నన్ను పరిత్యజిస్తారనుకోలేను. నాయందు మీకుకృతజ్ఞత ఉందని మీరే అన్నారు. నిజమే అనుకున్నాను. మిమ్ములనుగురించి నేను ఏదోకొండంతగా అనుకున్నాను. నాయందు జాలిపడో, పిల్ల

లను జూచి దయకలిగో, ఏదో ఒకభావంతో మీరు మీ దయకలిగో, ఏదో ఒక భావంతో మీరు మీబిడ్డను ఆసుపత్రిలో వదలి వేయటమనే త్యాగంచేసి, నాసంసారానికి ఆధారం అవుతారనుకొన్నాను. మీహృదయంయొక్క నిజస్వరూపాన్ని నేనుగ్రహించలేదన్నమాట! ఇంతకూ మీరూ, అందరిమో స్త్రరుఆడవాళ్ళే...నన్నమాట. ఈమాట అన్నానని దుఃఖపడవద్దు. నేనూ చాలాదుఃఖపడే అంటున్నాను. ఇంతకూఆసుపత్రి మిస్సమ్మలుచేశారు. రోగులకూ, మీవలె వచ్చినవాండ్లకూ కిరస్తానీసంగతులన్నీ బోధించి, ఎందరినో తమమతంలో కలుపుకొంటున్నారు. విద్యాబోధకులు గాను, వైద్యులుగాను వచ్చి వారు మన మనస్సులను క్రైస్తవమతాభిముఖంగా త్రిప్పుకొంటున్నారు. జాతికి ఈవిధంగా అపకారం చేస్తున్నారు.

ఇంతకూ మీనిశ్చయంఏమిటి? నర్సుగా ఉండి జీవితం గడిపేస్తారా? మతంపుచ్చుకొంటారా? నాకోరికను ఏమన్నా మన్నిస్తారా? ఈసంశయాలు నామనస్సును చీలుస్తున్నాయి. ఏదోఒకటి ఇదమిత్థం అని తెలిస్తేకొంత శాంతి కాబట్టి మీఅభిప్రాయాన్ని తక్షణం వ్రాయండి.

నేను మీకు ఇదివరలో పదిఉత్తరాలు వ్రాశాను. ఒక్కదానికీ మీజవాబులేదు. దీనికిమటుకు మీరు శ్రమతీసుకొని కవరుతెప్పించుకొని వ్రాస్తారన్ననమ్మకం ఏముంది ? అందుకని దీనితో నాఅడ్రసుగల కవరు పంపుతున్నాను—

ఇట్లు—

శాను. ఆమె రాకపోవడం, పదిఉత్తరాలకు
ఒక్కఉత్తరమై వ్రాయకపోవటం మొదలైన విష
యాలుతల్చుకొని ఆమె ాలన్నింత నిశ్చయానికివ
చ్చాను. ఎంతకోపంవచ్చిందిఆమెపై. స్వీకరించలే
దన్న ఉక్రోషం—ఆమెపైకోపంగాను ద్వేషంగా
మించింది. అందుకనే ఆఉత్తరం అంతనిష్ఠురంగావ్రాశాను.
మిషన్‌వాళ్ళను బాగా తిట్టాను అదీఉక్రోషంవల్ల నే.

ఆమె ఈఉత్తరాన్ని చూచుకొని చాలవిచారపడు
తుంది. పడితేపడ్డది; నామీద కోపంకూడావస్తుంది. వస్తేఏం
నాకింతకంటే పోయేదేమిటి? మిస్సమ్మలకు చాలకష్టం కలు
గుతుంది. కలిగితే నన్ను వాళ్ళు ఏంజెయ్యగలరు?— అని
ఇల్లాఅనుకొంటూ పోష్టుఆఫీసుకు వెళ్ళిఉత్తరం పోష్టుచేశాను.

## ఆమె

ఆలాగ ఆరోజు నిశ్చయంచేసుకోన్నతరువాత ఇక ఆ
ఆసుపత్రిలో ఉండటంఅంటే నాకుఅసహ్యం కలిగింది. నర్సు
లు నాబిడ్డను బహుప్రేమగా చూస్తూఉన్నారు. ప్రొద్దున్నే
స్నానంచేయిస్తారు. సరియైనవేళలో పాలు ఇస్తారు. అప్పుడ
ప్పుడు ఎవరోఒకరు ఎత్తుకొని ముద్దాడుతూవుంటారు. జన్మాం
తంఆబిడ్డకు ఏలోటూలేకుండా జరుగుతుందనేనమ్మకం నాకు
కలిగింది.

తల్లిలేక అల్లాడుతూన్న మేష్టరుగారి బిడ్డలదగ్గరకు
వెళ్ళాలని నామనస్సు తహతహలాడింది. నాబిడ్డను పరిత్య

జేస్తున్నానే అన్న విచారంనాకు లేశమన్నా లేదు. ఒక కుటుం బానికి సేవచేయటానికి పూర్తి అయిన అవకాశం ఉండే దుకై నాబిడ్డను నేనుప్రభువుసేవకై ఇచ్చేశానన్న సంతో షమే నాలో పొంగుతూ వచ్చింది. నాబిడ్డను ప్రభుసేవకై ఇయ్యటంవల్ల, నేను మిషను వారు నాయందుచూపినదయకు కృతజ్ఞతను కనపర్చినదాననూ అయినాను ఈకుటుంబానికి సేవచేయటానికి అవకాశం కల్పించుకున్న దాననూ అయి నాను. ఈఆలోచన నాకు ఎప్పుడూ సంతోషాన్ని ఇస్తూ వుండేది.

నేను పురుషసాంగత్యం కోరిఅవినీతి పాలైతద్వారా దుర్భర దుఃఖాగ్నిలో మాడిపోయినాను. ఆ అగ్ని నాలోని కామాన్ని దహించివేసింది. ఏపురుషుణ్ణి నేనిపుడు కామే చ్ఛతో ప్రేమించ లేను, కామతృప్తికోసకై నాలోని అణు వణువూ కొట్టుకొన్నరోజు లున్నాయి. దేహసౌఖ్యంకోసం ఈశరీరాన్ని అలంకరించి విరహవేదనను పొందినరోజులూ ఉన్నాయి. విసురైనగాలివానకునిటుఅటునూగుగన్నెరుమొక్క వలె నాతనూలత కామతృప్తికై ఊగినరోజులూ వున్నాయి. కాని జీవితంలో పడ్డకష్టాలు నాప్రకృతిని మార్చినవి.

దుర్భరావమానదురంతదుఃఖాగ్ని కామేచ్ఛనుమాడ్చి మసిజేసింది, నాలోవుండేయౌవనం ఇంకిపోయింది. పైకి అవ

యవములలో యౌవనస్ఫురణ ఉన్నా, ఆ అంతర్వాహిని ఎండిపోయింది. అందుచేతనే నేను నలభై సంవత్సరముల వయస్సుగల మనిషిని వివాహం చేసుకుంటానికి సిద్ధపడుతున్నాను. ఆయన చక్కదనంతో నాకేమీ పనిలేదు. ఆయన సాంగత్యంవలన సౌఖ్యంపొందగలనని నాకుపూర్తి అయిన నమ్మకం వుంది; ఆయన సహృదయుడు అదే నాకు కావలసింది. నేనుఆయనకు భార్యను అవుతానని అందరూ అంటున్నారు. రేపు అల్లాగే అనుకుంటారు. ప్రపంచంయొక్క దృష్టిలో నాస్థానం అదేకాని, ఆపిల్లలు మాతృస్థానాన్ని నేను ఆక్రమించబోతున్నాను. ఆయనకు భార్యా కావాలి. ఆపిల్లలకు తల్లీ కావాలి. ఈరెండువిధులు నేనే నిర్వహించబోతున్నాను కాని, ఆరెండవపనే నాముఖ్యవిధిగా నేనుపరిగణిస్తున్నాను.

ఆఆసుపత్రిలో ఉండడానికి నాకు ఇష్టం లేకపోయింది ఎప్పుడువెళ్ళిపోదామా అనిఆదుర్దా ఎక్కువైంది. ఇదివరలో ఆయన ఎన్నిఉత్తరాలువ్రాసినా నేను తిరిగి ప్రత్యుత్తరం ఇయ్యక ఆయనమనస్సును ఎంతోకష్టపెట్టాను. ఇప్పుడుమళ్ళీ ఆయనకుక్షమాపణవేడుతూ ఉత్తరంవ్రాయటానికి కొంచెం సిగ్గువేసింది. ఆయన నన్ను తిరస్కరిస్తారని నాకేమాత్రం అనుమానం లేదు. కాని ఏదో పిచ్చిభయంతో సిగ్గుతో వ్రాయటం పడలేదు; రెండురోజులు గడచినై. చివరకు క్షమాపణ వేడుతూ నానిశ్చయాన్ని తెలియపరుస్తూ ఆయనకో వుత్తరం వ్రాశాను.

## ఆయన

నేనుఉత్తరం పోస్టులోవేసి ఇంటికివచ్చాను. ఇంటికి వచ్చేసరికి నాబల్లపైన ఒకకవరు వచ్చివుంది. ఆదుర్దాగా విప్పిచూశాను. అదిఆమెదగ్గరనుండే వచ్చింది అనితోచింది. విప్పిచూశాను. ఇట్లావ్రాసింది.

గారికి—

ఈమూడు నెలలనుంచీ మీకువుత్తరం వ్రాయకుండా ఉన్నందుకు మీరునన్ను కృతఘ్నురాలని తలచి ఉంటారు. మీవిషయమై అనుకోని క్షణంలేదు. నాకుజన్మించినబిడ్డపై నాకుగల ప్రేమను వదులుకోలేక ఇంతకాలం మీకునిశ్చయమైన ప్రత్యుత్తరం ఇయ్యలేక పోయినాను, కరుణామయుడైన ఏసుప్రభువు ఆజ్ఞఅయింది. ఆబిడ్డను ప్రభువు సేవకై 'డెడికేట్' చేసి నేను మీసన్నిధికి వచ్చుటకు కృతనిశ్చయురాలనైనాను. తల్లిలేని మీపిల్లలకు జన్మాంతం సేవచేయటానికి అవకాశం కలిగినందులకు ప్రభువుకు నేను కృతజ్ఞతాపూర్వకముగ వందనములు అర్పిస్తున్నాను. మీరు వచ్చి నన్ను శాస్త్రోక్తంగా వివాహం చేసుకొని తీసుకుపోండి.

మన వివాహం లోకదృష్టిలో సామాన్య స్వరూపాన్ని పొందినా మీవంటివారి కదృష్టిలో ఇరుపక్షములా స్వార్థత్యాగంతో కూడుకొన్న మహత్తర కార్యమని నా

ఊహకు తోస్తూంది. అవినీతితో కూడియున్న నా అనుభూత జీవితాన్ని మీరు ఉదార బుద్ధితో క్షమించి నన్ను స్వీకరి స్తున్నారు. మీరు చూపిన ఆదరణకు కృతజ్ఞతాభావంతో నేను మీబిడ్డలకు తల్లిని అవటానికి అంగీకరించాను. మీబిడ్డ లకు తల్లిని అవటంలో మీకు భార్యనుకూడా అవుతాను అను కోండి. కాని మాతృవిధి నిర్వహించటమే నేను ప్రధానంగా పెట్టుకొన్నాను.

సాధారణంగా స్త్రీపురుషుడు స్త్రీని ప్రేమించాడంటే ఆమెలో ఏదో సౌదర్యాని చూశాడన్నమాటే. శరీరాశ్ర యం సౌందర్యం. ఒకరిసానిధ్యం ఒకరికి ఆనంద కారణం. వివాహం ఆధారపడి ఉన్నది ఆధర్మంపైనే కాని మనపర స్పర సంబంధంలో ప్రకాశించే నూతనధర్మం చాలా అల్ప విషయాలపైని ఆధారపడి ఉన్నది. మీరు నాకు చేసిన సాహాయ్యానికి కృతజ్ఞతా, మీపిల్లల దిక్కు లేని స్థితినిజూచి దయా, మీఒంటరితనాన్నిజూచి నాలో కలిగినజాలీ, నాలో నున్న మాతృప్రేమా, సేవాతృష్ణా, ఈచిన్నవిషయాలేమన కలయికకు ప్రాతిపదికలు. ఒక్కొక్కసన్ని వేశం ఒక్కొక్క కూర్పులో మహత్తర విషయం అవుతున్నది. ఒకరచనను రసవంతమైన. కావ్యంగా చేయగల సామర్థ్యమూ, శక్తీ, శోభా, ప్రతిభా, సాహిత్యసారమూ, పరిపూర్ణతా, మనకల యికలోఉన్నాయి. ఛాందస సనాతనులకు ఈనూతనభావమే

అర్థంకాదు. ఈకొత్తసౌందర్యమే అర్థంకాదు. విషయేచ్ఛకు దూరమైె, శరీర సౌందర్యానికి సంబంధములేనిదై, పూర్తిగా "సెంటిమెంటు"మీద ఆధారపడియున్న ఈసన్నివేశంలో ఉండే మహత్తరమైన నూతనధర్మంసౌందర్యం, వాళ్ళసామాన్యదృష్టికి అవగతం కాదు ఎదో ఆవేశంతో వ్రాశాను. క్షమించండి. మీరాకకై అనుక్షణమూ ఎదురుచూస్తూంటూను.

ఉంటాను.

—శ్రీ—

ఉత్తరం పూర్తిగా చదివాను. ఇంత సంస్కృతి గల స్త్రీకి, నేను అంతకు ముందు వ్రాసిన ఉత్తరం ఎంతమనః క్లేశాన్ని, కలిగిస్తుందో అని విచారం కలిగింది. ఆ ఉత్తరం తొందరపడి వ్రాశాను అందులో ఆమెను "కృతఘ్నురాలా' అని నిందించాను. "నిన్ను గురించికొండంతగాభావించాను.నీవు అందరంటి ఆడదానివే" అని చులకనచేశాను! ఇంకేవేవోఅన రానిమాటలన్నాను! ఆఉత్తరంచూచి ఆమె అవమాన తప్త హృదయ అవుతుందేమో? అయి నన్ను గురించి అసహ్యపడుతుందేమో? పడి ఈతనితో వివాహం కూడదనుకుంటుందేమో? ఎంత పొరపాటు పని జరిగింది! ఎంత తొందర పడ్డాను! నోటికిఅందబోతున్న అమృతభాండాన్ని ఒలకబోసుకొన్నానే! ఒక్క అవివేకపుకార్యంతోఆమెకు మనోవ్యధకలి

గించానే! ఏమిచేసేది! అప్పటికే అయిదుఅయింది. పోస్టుకట్టి వేసిఉంటారు. చప్పునపోస్టుఆఫీసుకుపోయి ఆఉత్తరాన్నివిత్ డ్రాచేయటానికి ప్రయత్నం చేద్దామని ఆతురత కలిగింది. చొక్కా-అవీ వేసుకొన్నాను. జేబులో డబ్బులేదు. బీరువాలో ఉంది. తాళంచెవులు కనిపించలేదు. హృదయంతత్తర పాటుపడుచున్నది. ఉత్తరంవిత్ డ్రాచెయ్యటానికికూడాపాయి కట్టాలె! అందుకని డబ్బు తీయటానికి తాళం చెవులకోసం పావుగంట వెదికాను కాని కనిపించలేదు. పోనీ చప్పున వెళ్ళి ఉత్తరం ఆపించి తరువాత డబ్బుకట్టవచ్చు అని తోచింది. ఆఆలోచనలో బైటికి వచ్చాను. టపాసంచులతో నిండినబండీ మాఇంటిముందరగా స్టేషనుకు పోతున్నది ఇంకచేయతగినదేమీలేదు. నిరుత్సాహంతో కూర్చీలోకూలబడ్డాను. చీకటులు మెల్ల మెల్లగా క్రమ్ముకుంటున్నాయి. వెల్తురు మెల్లగాతరిగిపోతున్నది. వెలుగుచాయల ఆచీకట్లో లీలగాకనిపిస్తూఉన్నాయి. అంతవరకునుహాయిగా వింటూన్న ఏదోఅవ్యక్తమధురసుశ్రావ్యగీతాలాపన దూరదూరమై అంతకంతకు సన్నగిలి క్రమంగా సురిగిపోతున్నట్లు నాకు ఏదో భావం కలిగింది —What a trifling incident and yet–the resut how disastrous అనుకొన్నాను.

## ఆమె

ఆయనకు ఉత్తరం వ్రాసిపంపినప్పటినుండి నాకు ఆందోళన ఎక్కువైంది. నాజీవితపథం ఇదీ అని నిశ్చయం చేసుకొన్నతరువాత నేనున్నచోట నాకు కంటకశయ్య అయింది స్వధర్మాన్నిగుర్తించినతరువాత అధర్మస్వీకరణకై నాహృదయం తత్తరపడటం అసహజం కాదు.

అదీకాక—.

మూడునెలలు ఆపెద్దమనిషి మొత్తుకున్నా ఉత్తరం వ్రాయలేదు. నన్నుగురించి ఆయన దురభిప్రాయపడటానికి అవకాశంఉంది. కాని నాక్షేమం ఆయనకు తెలుస్తునే ఉందిగా! అయినా ఆయనఅల్లాగ తొందరపడేమనిషి కాదు. అని ఇల్లాగ అనుకుంటూఉన్నా ఎందుచేతనో నామనస్సులో భయం కలగడం మొదలుపెట్టింది. నామనస్సు అనుమానగ్రస్తమవడం మొదలు పెట్టింది.

నేనుచక్కనిదాన్ని కాదు. యౌవనంలో లేను. వయస్సు ఏమీ పొంగిపోవటం లేదు. ఆయనకు నేను చేసే సాయం ఎవ్వరుచెయ్యరు? ఎంతమంది అనాధస్త్రీలునిలువ నీడలేక తింటానికికూడు లేక అల్లాడుతున్నారు! అనాధశరణాలయాల్లో ఎందరో వితంతువులు తగిన వరుడు దొరక్క పడిగాపులు

గాస్తున్నారు. ఆయనపిల్లలను కాస్తచూచి ఆయనతో సుఖించ టానికి ఎవ్వతైనా అంగీకరిస్తుంది.

నేను ఇంతకాలము కాలయాపనచేసి ఆయన ఆగ్రహానికి గురిఅయిఉంటాను. ఏదోనర్సునై పోదామనుకున్నాను మహాభాగ్యంలాగ నర్సునై ఒంటరిగా జీవిస్తున్న ఎంతమంది జీవితాలను చూస్తున్నానుకాను! వాళ్ళు వైవాహిక జీవితానికై ఉవ్విళ్ళూరుతున్నారు. రోగులకు సేవచేయటంలో తృప్తినిపొంద గలిగి, సౌఖ్యాన్ని అనుభవించగలిగి ఉండటానికి మనస్సు ఎంత పరిపక్వంకావాలె! అది నాబోటి సామాన్యస్త్రీకి లభ్యంకాదు అని అనుకుంటూ వరండాలో కూర్చున్నాను. అప్పటికే రాత్రిబాగా పొద్దుపోయింది. ప్రక్కమీద కువాలినిద్రపోయినాను. ఆరాత్రికలలో మళ్ళీ ఆపొట్టిమనిషి, మందారపూలు తురిమిన కేశబంధతో కనపడ్డది ఆమెమంద గమనంతో వచ్చి, నాపక్కలో కూర్చున్నది. నాచెక్కిళ్ళు నొక్కింది నాబుగ్గలు ముద్దాడింది. ఆమెహృదయమును అలంకరించింది పుష్పమాలలోనుండి నాలుగుచక్కని పువ్వులను జాగ్రత్తగాతీసి నాదోసిలిలోపెట్టి, నవ్వింది. నేను ఆదోసిలితోనే నమస్కరించి తలవంచాను. తలఎత్తేసరికి ఆమెమెట్లు దిగి వెళ్ళిపోతున్నది. ఇట్టిస్థితిలో మెలకువవచ్చింది. అప్పటికే తెల్లవారుతున్నది.

నేను వెంటనేలేచి స్నానంచేశాను. ఆరోజు శుక్రవారమూఅని జ్ఞాపకంవచ్చింది. వెంటనేతలారస్నానంచేశాను

తలార్చుకొని, దువ్వుకొని, ముడివేసుకొని ఆమందారపూలు పెట్టుకొన్నాను. ఆరోజుననే వుత్తరం రావాలిసింది. ఆతురతతో ఉత్తరంకోసం నిరీక్షిస్తున్నాను.

## ఆయన

నేనుతొందరపడి వ్రాసిన ఉత్తరంపోస్టులో వేసినమరునాడు మారంగనాథబాబు వచ్చాడు. వాడూ నేనూ చిన్నతనంలో సహాధ్యాయులము. ఒక్కకంచాన తిని ఒక్కమంచాన పడుకొన్నాము. అదీకాక ఆప్తబంధువులము మాజీవితం కొంచెం హెచ్చుతగ్గుగా ఒకేమోస్తరు నడుస్తున్నది. వాడికీ భార్యావియోగం కలిగింది. వాడికీ ఆరుగురు పిల్లలున్నారు. కాని పిల్లలు కొంచెం పెద్దవాళ్ళు అవటంచేతా, ఏ ముసలమ్మసాయమో లభించటంచేతా, వాడు నావలె జీవితం విస్తారం బాధలూ పడ లేదు, వివాహం చేసుకోవలెనని అనుకోనూ లేదు.

నాయందు సానుభూతి గలిగిన బంధువు వాడొక్కడే స్నేహితులలో డాక్టరుగారూ, బంధువులలోరంగనాథబాబూ నాకు ఆప్తులు. నా ఆదర్శములను వాడు గ్రహించాడు. నా కోరికలను మన్నించాడు. నాకష్టాలుగుర్తించాడు. నాహృదయం తెలుసుకున్నాడు.

మారంగనాథబాబువచ్చాడంటే మాఇంట్లో పండగ. మామయ్యవచ్చాడు, మామయ్యవచ్చాడనిపిల్లలు గంతులు వేస్తారు. వాడువస్తూ, రిక్తహస్తాలతో ఎప్పుడూరాడు. ఏదో తింటానికి తేకమానడు, పిల్లలు వాడిపైకి ఎగబడకమానరు. మాఆవిడ ఉన్నప్పుడు ఆవిడ వీణ్ణి జూచి పొంగిపొయ్యేది. వాడితో నన్నుగురించి ఎన్నోసంగతులూ, నేరాలు చెప్పేది. అవసరం ఉంటే నన్నువాడుమందలిస్తాడు. ఇంట్లో పిన్నలకూ పెద్దలకుకూడావాడుఆప్తుడు. వాడువచ్చినరోజు రాత్రిమాకు నిద్రఉండదు. వెన్నెలలోనో, చీకటిలోనో, కూర్చుని ఎన్నో సంగతులు మాట్లాడుకొనేవాళ్ళం. మా చిన్నవాడు వాడి పక్కలో తప్ప ఇంకెక్కడానిద్రపోయేవాడు కాడు. ఆరాత్రి వాడి పక్కలో చోటుకోసం మాపిల్లలు తగూలాడేవారు అందరూ వాడిచుట్టూ పడుకొని నిద్రపోయేవాళ్ళు. వాడికి నాకూ అట్టిసంబంధం ఉంది. ఆరోజునవాడూ నేనూ, కలిసి సముద్రపుటొడ్డుకు వెళ్ళాము. పిల్లలుకూడామాతోవచ్చారు. డాక్టరుగారు తమ కారులో మమ్మలను తీసికొని వెళ్ళారు. డాక్టరుగారూ,వాడూ, నేనూ ఇసుకతిన్నెలపై కూర్చున్నాము పిల్లలు ఆడుకొంటున్నారు.

క్రిందటిరోజున నేనువ్రాసినఉత్తరం సంగతి డాక్టరుగారికి చెప్పాను. ఆమె ఎంతఅసహ్యించుకొంటుందో, దాని పరిణామము ఎల్లాగఉంటుందోఅని నేను పడుతూన్న వ్యాకులతను గురించి ఆయనకు చెప్పాను. ఆయన అది చాలా అవివేకపు

పనేఅయినా దానివలన అంతప్రమాదంఏమీా ఉండకూడదూ అని,ఆయన తనకుతోచినఊహా నాకుచెప్పాడు. ఆ మాటల వలన నాకు ఏమంత తృప్తికలుగలేదు. ఈసంగతులు విని, మా రంగనాధబాబు అన్నమాటలు ఇవి.

"పోనీలేరా,ఆవిడఅంతగానిన్ను నిరాకరిస్తే నీవుజీవించ లేకపోవు. నీవివాహప్రయత్నాన్ని గురించి మనవాళ్ళు విప రీతంగా అనుకొంటున్నారు. నేనా మాటలు వినలేనంత కష్టంగాఉన్నాయి"అన్నాడు, "ఏమనిఅనుకుంటూఉన్నారు చెప్పు." అన్నాను. ఆసంగతులన్నీ నీకు చెప్పితే నీ మనస్సు నకు బాధ కలుగజేసినవాణ్ణి అవుతానని సందేహిస్తున్నా నన్నాడు. నీమనస్సుకు బాధ కలిగితే, నాకూ కలిగినట్లే! అయినా ఇప్పుడు నామనస్సుకు ఎంత పరుషవాక్యమైనా బాధకలుగజేయలేదు. నేపడ్డ బాధలవల్ల నామనస్సు మొద్దు బారిపోయింది అన్నాను. సరే. అయితే విను అని ఇల్లాగ చెప్పాడు.

"వీడూ(నన్ను ఉద్దేశించిఇతరులుఅనటం) పరమదుర్మా ర్గుడైనాడు. భార్యావియోగం, పుత్రికావియోగం వలన కలి గినదుఃఖాన్ని రోజులుగడవకనుంచేమరచిపోయినాడు. మంచి బట్టలు వేసుకొని తిరుగుతున్నాడు. ముఖం మళ్ళీ తేటగానే కనపడుతున్నది. వివాహంచేసుకొని సుఖపడాలనికూడా అను

కొంటున్నాడు. ఆభార్యమీద ప్రేమంతా ఏమైందో! కూతురు పోయినరోజున గుండెపగిలేటట్లు ఏడుస్తూ స్మశానాగ్నిలోపడి కాలి బొగ్గు అయిపోతానని ఉరికాడు. ఆదుఃఖమంతా ఏమై పోయింది? సుఖంగా వివాహం చేసుకుంటానికి ఆశ ఎల్లా కలిగింది? ఇంకా సుఖపడాలన్న ఇచ్ఛకలగటమే దుర్మార్గం అని బంధువర్గమంతా అనుకుంటూ ఉన్నదిరా'' అన్నాడుఅని నాముఖంవంక చూశాడు. నాలో చలనం ఏమీ లేదు. నిజమే——నాబిడ్డ పోయిన తరువాత నేను బ్రతుకుపై ఆశకలిగి ఉండటమా! అంత హృదయ కాఠిన్యం, అమానుషకార్యం ఇంకొకటి లేదు. ఆమాట నేను అంటాను కాని, ఈ పిల్లలను పెంచే దిక్కు-లేక, వాళ్ళను పోషించు పెద్దవాళ్ళను చేయటానికి ఆడసాయంకోసం ఈవివాహకార్యం తలపెట్టాను కాని, సుఖపడదామని కాదు సుఖం వద్దు. సౌఖ్యం వద్దు. సుఖపడేఘటం ఇదివరకే చనిపోయింది. నేనుగా మిగిలి ఉన్నది కట్టెకొంతకాలము ఉండాలి.

వివాహం మాట ఎత్తావుకాబట్టి దానివిషయమై నీ బావమరది అన్నమాటలు విన్నావా? అన్నాడు రంగనాథ బాబు. "ఏమన్నాడు?" అని నేను ఆతురతతో అడిగాను నా బావమరదికాదు చాలా సత్ పురుషుడు. జీవితంలో అతనివల్ల నేనెంతో సాహాయ్యమును పొందాను. అటువంటి మంచివాడు ఈప్రపంచలో ఇంకొకడు లేడని నావిశ్వాసము

వాళ్ళ అక్కయ్య వాడికితల్లి. వాడి అక్కపిల్లలమీదఉన్న ప్రేమ ఇంతా అంతా కాదు. నవనీత హృదయుడు స్వాతి కుడు. ఆతన్నిపై నాకత్యంతమైన ప్రేమ. కాబట్టి అటువంటి ఋషితుల్యుడైన నాబావమరది ఏమనిఅనుకుంటూఉన్నాడో నాహృదయం గ్రహించాడో లేదో నని నాకు సహజంగా ఆదుర్దాకలిగింది. మా రంగనాథబాబు "నిన్నుగురించి, మీ బావమరది ఇట్లా అన్నాడురా!" ఏమనీ!

"మా బావ ఇంతపరమనీచుడని నేనెప్పుడూ అనుకో లేదు. ఆయన హృదయం అంత శిలామయమనీ, వజ్రతుల్య మనీ కూడ నాకు తెలియదు. పిల్లలకోసమనీ పిల్లలకు అండ కావాలనీ కోరికతోనే వివాహంచేసుకుంటూ ఉన్నానని అంటాడేకాని అదంతా వట్టి కుంటినెపం. మా అక్కయ్య యందు ప్రేమగలవాడైతే, అతడు ఎండిన మోడులాగ విధు రుడై ఉండి పోవాలేగాని, పెండ్లాడుతాడా? స్వసౌఖ్యంకోసం తుచ్ఛమైన మోహంతో, స్త్రీవాంఛతీరక ఎవ్వతెనో ఒక ర్తెను దొరికినదాన్ని, ఏ 'బిచ్' నైనాసరే వివాహం చేసు కొంటానికి సిద్ధపడుతూ, పైగా ఆనోరులేని పిల్లలను అడ్డు పెట్టుకుంటూన్న దుర్మార్గుడు. ఆ వచ్చే, జారిణి, తనకుభార్య అయితే కావచ్చును. భార్యఅనేమాటకూడా వాడ కూడదు. తనకు పనికివస్తే వస్తుందికాని ఆపిల్లలకుతల్లి ఎలాగ అవు తుంది? పదిహేను సంవత్సరాలు తనతో సహచర్యంచేసిన

వ్యక్తికీ, తనకూ మధ్యఏర్పడ్డపరిచయాన్ని ఒక్క దెబ్బతో తుడిచివేసి, ఇంకొకరిని పెండ్లాడుతాడు! ఛీ! పిల్లలమీద అయినా ప్రేమ లేని రాక్షసి ఆయన!

ఆపిల్లలసంగతి ఏంకావాలె? ఆవచ్చేఆవిడ వాళ్ళను ప్రేమగా చూస్తుందన్న నమ్మకంఏమి? ఏం బట్టింది ఆవిడకు ఈపిల్లలను ప్రేమతో చూచిందాకా? మొదట్లో ఆయనను సంతోష పెట్టటానికి పిల్లలను సరిగా చూచినా, జీవితాంతం వరకూ అల్లా ప్రవర్తిస్తుందా ఎక్కడైనా? ప్రపంచంలో ఎక్కడైనా సవతితల్లి ప్రేమగాఉండటం విన్నామా? సవతి తల్లిప్రేమ అని సామెత ఉండనేఉంది. ప్రపంచాన్ని మోస పుచ్చటానికి, పిల్లలకోసం పెండ్లి అంటాడేకానీ, అది వట్టి దొంగవేషం...స్త్రీ కాంక్ష, తుచ్ఛమైన కామం, ఆయన గారి వివాహేచ్ఛకునిజమైన కారణాలు నలభై ఏండ్లు వచ్చి ఈ వెధవబుద్ధిఏమిటి? అంత స్త్రీవాంఛ వుంటే ఏదోవిధంగా తృప్తిపరచుకోవాలెకాని పిల్లలను సవతితల్లి క్రూరత్వానికి గురిచేస్తాడా?ఆతల్లి పోవడంతోనే, పిల్లలగతి ఇల్లా అయింది.

అని ఇల్లాగమాట్లాడి కంటతడిబెట్టాడురా మీబావ మరిది, అని చెప్పి రంగనాథబాబు ఊరుకొన్నాడు.

"ఆమాటలలో తప్పేమి ఉంది? లోకంలో అంతా అల్లాగే అనుకుంటారు. అటువంటప్పుడు బావమరది అల్లా అనుకోటంలో తప్పేముంది?" అని నేను అన్నాను. అంత

వరకు దుఃఖాన్ని దిగమ్రింగగలిగాను. కాని నాదుఃఖం పొంగి పైకిదూకినది. ఆలాగ సముద్రంవంక నే పిచ్చిచూపులుచూస్తూ మౌనంగా చాలాసేపు కూర్చున్నాను.

ఇంతలో చంద్రోదయం అయింది. చంద్రోదయంచే సముద్రుడు సంతోషంతో పొంగిపోతూ తన సహస్రహస్తాలనూపైకెత్తి చంద్రబింబాన్ని తన హృదయాన్ని అదుముకొన్నాడు. ఆబింబం ఆసముద్ర హృదయంలో చలించిపోయింది. సముద్రుడు సంతోషంతోపొంగి గంతులేస్తున్నాడని లోకం అంతా అనుకొంటుంది. ప్రియురాలిని హృదయాన చేర్చుకొని కులుకుతున్నాడని ప్రపంచం అనుకుంటుందే కాని అతనిలో ఉన్నట్టి, ఆ అబ్ధిగర్భోజ్జ్వలద్బడబాగ్ని అతని హృదయాన్ని ఎంతదహించివేస్తున్నదో ఎవరికి తెలుస్తుంది!! అనుకొన్నాను. ఆ తరువాత ఇంటికి వచ్చేశాము.

## ఆమె

నేనువ్రాసిన ఉత్తరానికి మూడవరోజుకల్లాజవాబు రాలేదు. వెంటనేఆయన వ్రాసిఉండడు? రేపో ఎల్లుండో రావచ్చు కాని ఒక్కక్షణంకూడా వేచియుండటానికి. నాకుమనస్కరించలేదు. హృదయం దడ దడ కొట్టుకొన్నది. కలలో కనబడి ఆమెనాల్గు పూవులుమాత్రమే నాకు ఇయ్యటం జ్ఞాపకం వచ్చింది. అవి ఆమె కంఠసీమ నలంకరించిన పుష్పదామము

లోనివి. తన నల్గురు పిల్లలనూ నాకు ఒప్పజెప్పినట్లు నేను భావించాను. నావిధి నేను నిర్వహించాలన్న ఆనర్దా ఎక్కువైంది. రెండుమూడురోజులలో ఆయన రావచ్చు. ఆయన వచ్చేంతవరకూ వేచియుండటానికి నాకు మనస్థిమితముఎక్కడిది! కాన వెంటనే నేను వారిని రమ్మంటూ టెలిగ్రాము ఇప్పించాను. మర్నాడువరకు వేచియుండాలె! ఆఇరవైనాలుగు గంటలు కూర్చోవాలె! ఆ ఇరవైనాల్గుగంటలూ నాకు ఇరవైనాలుగు సంవత్సరాలవలె తోచింది. ఏవేవో తియ్యనితలంపులతో కాలాన్ని నెట్టివేయ నిశ్చయించుకొన్నాను.

## ఆయన

నేను నిష్ఠూరంగా వ్రాసిన ఉత్తరాన్ని జూచుకొనిఆమె ఎంతమనఃక్లేశాన్ని పొందుతుందో పరిస్థితులు ఏవిధంగా విషమిస్తవోఅని నేను ఎంతోవిచారపడుతూకూర్చున్నాను. మూడవరోజుకల్లాఉత్తరాన్ని చూచుకొనిఅంత త్వరితంగా ప్రత్యుత్తరమియ్యటం నాకాశ్చర్యం కలిగింది. వ్యవహారం బెడిసికొట్టేట్లు ఉంటుంది. లేకపోతే అంత తొందరగా ఉత్తరం ఎందుకు వ్రాస్తుందీ అనుకొన్నాను. ఉత్తరాన్ని చింపుతుంటే చేతులు వణకినై, గుండె దడదడ కొట్టుకుంది ధైర్యాన్ని చిక్కబట్టి ఏమైనాకానీ ఏంజేస్తాం, చేసిన నేరానికి ఫలం అనుభవింపక తప్పుతుందా అని మొండిధైర్యం తెచ్చుకొని ఉత్తరాన్ని చింపాను. ఎంత ఆశ్చర్యం. ఏమిటీచిత్రం! నేను ఆమెకువ్రాసిన

ఉత్తరమేఅందులో ఉంది! ఏమిటీ విచిత్రంఅని ఆలోచించాను, ఆనోజున ఆకోపంలో, ఆ తొందరలో, నేను వ్రాసిన ఉత్తరాన్ని ఆవిడ చిరునామా వ్రాసిన ఉత్తరంలో పెట్టక ఆమె ఉపయోగాని కై నా చిరునామా వ్రాసియుంచిన కవరులో పెట్టాను ఆవిడ చిరునామాగల కవరు దానిప్రక్కనే ఉంది. నాఉత్తరం నాకే వచ్చింది. చాలా సంతోషం వేసింది. ఆ చిన్న పొరపాటు నాకు ఎంత ఉపకారిఅయింది. వెంటనే ఆ ఉత్తరాన్ని చింపి ముక్కముక్కలుగా చేశాను.

ఆతరువాత బెజవాడ వెళ్ళటానికి ప్రయాణసన్నాహంలో ఉన్నాను. అంతలోకి నాకు టెలిగ్రాం వచ్చింది. వెంటనే బయలుదేరిరమ్మని అందులో ఉంది.

మర్నాడుబెజవాడ వెళ్ళానుఆమెనుఆసుపత్రిలోకలుసుకొన్నాను. ఆఖరుసారిబిడ్డనుచూచి ముద్దుపెట్టుకోని రమ్మని కోరాను. కాని ఆమె దానికి అంగీకరించలేదు, అమ్మగారికీ నర్సులకూ పూలూ,పండ్లూ ఇచ్చి కారులోఎక్కి అనాథ శరణాలయానికి వచ్చాము. మరచిపోయినాను చెప్పటం, నాతో అప్పుడు డాక్టరుగారుఉన్నారు. అసలువారి కారులోనే బెజవాడ వెళ్ళాము. ఆసాయింత్రం ఎనిమిదిగంటలకు మాకిద్దరికీ శాస్త్రోక్తంగా వివాహంజరిగింది. ఊళ్ళోఉన్న పెద్దమనుష్యులంతా వచ్చారు.

ఆరాత్రి ఆశరణాలయంలోనే గడిపి మర్నాడు వేకువ ఝామున బయలుదేరి డాక్టరుగారి డారులోనే ఇంటికి వచ్చేశాము. మేము వచ్చేసరికి పిల్లలు బిక్క ముఖాలు వేసుకొని చూస్తున్నారు. ఈ రెండురోజులూ దాసీదే వాళ్ళను కనిపెట్టి చూస్తున్నది. కాని వాళ్ళబట్టలు మాసిఉన్నాయి. తలలు దువ్వుకోలేదు. ముఖాలువాడిఉన్నాయి. "ఇట్లాఉన్నా రేమే పిల్లలూ" అన్నాను దాసీదానితో. అది ఏదో వెధవసమాధానాన్ని చెప్పింది. నేనూ డాక్టరుగారూ గదిలోకుర్చీలోకూర్చున్నాముఒకరిముఖాలొకరు ఊరికేచూచుకొన్నామే గానివిస్తారం మాట్లాడటానికిమాకేమీ కనిబడలేదు. ఆయనముఖం ఆనందతో తాండవిస్తున్నది. నన్ను ఒకఇంటివాణ్ణి చేసింది ఆయనే అని నేను కృతజ్ఞతా భావంతో ఉన్నాను.

ఇంతలోకి మాపిల్లలు నాగదిలోకి వచ్చేశారు. మంచి బట్టలువేసుకున్నారు. తలలు దువ్వుకున్నారు. ముఖాలుకళకళలాడు తూన్నవి. ఎప్పుడు వచ్చిందో ఎప్పుడు చేసిందో ఈపని! "నాపిల్లకష్టాలు తీరినాయండీ" అని నేను డాక్టరుగారితో అన్నాను. ఆయన నిజమే అన్నట్లు తలవూపుతూ "మీాకష్టాలు తీరినై" అన్నాడు. నాకష్టాలు ఈజన్మలో తీరవు. నాబిడ్డను నేనెట్లా మరచి సుఖపడగలుగుదునండీ?

ఏతీవ నన్ను ఈఇహలోకవాంఛలకు బంధించెనో, ఆది భస్మీకృతంబయ్యె. ప్రస్ఫుట వినీలంపు విస్ఫురన్నయనాజ్ఞ దృగ్బాణసమితి నాహృదయాన సోకదిక. ప్రియవర్గసామ్రాజ్యప్రేమైకమూర్తులు నేడుకనుల కింపెనయ దర్శనముగూర్ప

రారు. నాకు సౌఖ్యంబు స్వప్నప్రాయమేగాక, జగతి జీవితము, నిస్సారమై కన్పట్టు అనిఒకట మూల్గు మూల్గాను.

ఆ మరునాడు నాబంధుగులలో ఒకరు వచ్చారు. మాటప్రస్తావనలో నేను వివాహం చేసుకొన్నానని చెప్పాను అతడు ఆశ్చర్యపోయి ఎంతో వింతగా చూస్తూ, ఎవరుగా ఆమె, ఏవూరుఆమెది, ఎవరికుమార్తె, ఏశాఖవాళ్ళు, వైదికులా? నియోగులా? అన్నప్రశ్నలు ఇరవై అడిగాడు.

ఎవరో, ఏశాఖో, ఎవరికుమార్తో, ఏవూరో, వైదికులో, నియ్యోగులో, ఏమీ తెలియను నాకు. ఆమె— స్త్రీ—అని వివాహం చేసుకొన్నాను. అనేసరికి, ఆయన తెల్లపోయినాడు.



## మునిమాణిక్యం నరసింహారావుగారు

కాంతం కథకులనే పేరుతో ప్రసిద్ధులైన మునిమాణిక్యం నరసింహారావుగారు 1898 లో గుంటూరు జిల్లాలో సంగం జాగర్లమూడి గ్రామంలో జన్మించినారు. గుంటూరులోనూ, విజయనగరంలోనూ విద్యాభ్యాసం చేసినారు. (బి.ఏ.ఎల్.టి.) బందరు హిందూ కాలేజి హైస్కూలులో చాలకాలము చరిత్రోపాధ్యాయులుగా పనిచేసి రిటైరు అయి విశ్రాంతి పుచ్చుకొంటున్నారు.

మునిమాణిక్యంవారిని చూచి ముసిముసి నవ్వు నవ్వని ఆంధ్రుడు ఉండడు. వీరి రచనలు అన్నీ నవ్వించేవే! గృహ జీవితములోని కళాప్రసక్తములైన రసవద్వినోద కలాపాలను కథావస్తువుగా తీసుకొని ఇరవై అయిదు గ్రంథములు వ్రాసినారు. గార్హస్థ్య జీవిత సౌందర్యమును మనోహరంగా ఆవిష్కరణ చేసినారు. ఆంధ్రుల అభిమానకథకుడు. "కాంతం కథ వ్రాస్తే మునిమాణిక్యమే వ్రాయాలె. మునిమాణిక్యం వ్రాస్తే కాంతం కథ వ్రాయాలి" అన్నారు విమర్శకులు. వీరివలె సాంసారిక జీవితములోని రమణీయ దృశ్యాలను చిత్రించినవారు ఇంకొకరు లేరు.